ప్రచురణ : 2001
ప్రతులు : 500
దశమ కుసుమం

వెల రు. **125-00**

ప్రతులకు :

డా॥ స్వర్ణ వాచస్పతి B. V. Sc
(అధ్యక్షులు - రుద్రకవి సాహిత్యపీఠము, తెనాలి.)
రిటైర్డు వెటరినరీ అసిస్టెంటు సర్జన్
నారాయణపురం, దాచేపల్లి - 522 414
గుంటూరు జిల్లా. ఫోన్ (08649) 57902.

గూడవల్లి చంద్రమోహన్ B. Com
6-5-22, జైన్ టెంపుల్ స్ట్రీట్, తెనాలి - 522 201.

విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
4-1-435, విజ్ఞాన భవన్
బ్యాంక్ స్ట్రీట్.
హైదరాబాదు - 500 001.

విశాలాంధ్ర బుక్ హౌస్ :
విజయవాడ, హైదరాబాదు, అనంతపురము, గుంటూరు
విశాఖపట్టణం, హనుమకొండ, కాకినాడ, తిరుపతి.

ముద్రణ : న్యూ విజయ ఆర్టు ప్రెస్
గాంధిచౌక్, తెనాలి.

# పరిచయము

మా తండ్రిగారైన విమర్శకాచార్య, శిల్పకళాకోవిద స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారు కాశ్యపశిల్పము, మానసారము, శిల్పరత్నము సమరాంగణ సూత్రధార, అపరాజిత పృచ్ఛ, విశ్వకర్మప్రకాశ, విశ్వకర్మీయశిల్పము, శిల్పసంగ్రహము, మయవాస్తు, మయమతము, ఆత్రేయ శిల్పము, నారదీయశిల్పము, గార్గేయాగమము పరశివ విశ్వకర్మాగమము మున్నగునెన్నియో ప్రాచీన గ్రంథములను పరిశీలించి వాటినొక పద్ధతి ప్రకారము 16 భాగములు గల "భారతీయ మహాశిల్పము" అను బృహద్గ్రంథముగ తయారు చేసిరి. అందు 16వ భాగము శిల్ప పదములతో కూర్చిన నిఘంటువు.

మా తండ్రిగారు 1951 సంవత్సరము శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవి మహాకవి కందుకూరి రుద్రయ ప్రణీత నిరంకుశోపాఖ్యానమునకు సుధాతరంగిణీ వ్యాఖ్య రచించిరి. ఆ గ్రంథము మహా పండితుల ప్రశంసలను పొందుటయేగాక 1999 సం॥న పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయము, హైదరాబాదు వారిచే పునర్ముద్రణ జరిగినది.

మా తండ్రిగారు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారి ఆర్థిక సహాయముతో భారతీయ మహాశిల్పము 1, 2, 3 భాగములను 1971 సం॥ ముద్రించిరి. నేను 1992 సం॥ వెటరినరీ అసిస్టెంటుసర్జన్‌గా పదవీ విరమణ గావించిన పిమ్మట శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో 1996-97 భారతీయ మహాశిల్పము 4, 5, 6 భాగములను, 1997-98 లో 7, 8, 9 భాగములను ముద్రించుట జరిగినది. మరియు 15వ భాగము నందలి యొక భాగమును 'విశ్వ

బ్రాహ్మణ విజ్ఞానము' అను పేరుతో ముద్రించుట జరిగినది. మా తండ్రిగారి గ్రంథములతో బాటు నేను రచించిన 'వాల్మీకి రామాయణ సౌరభాలు' మహాభారత స్వస్వరూపము, అఖిల దేవతాస్తోత్ర మంజరి, రావణబ్రహ్మ చరిత్రము, అథర్వణాచార్యుడు, కందుకూరి రుద్రకవి చరిత్రము మున్నగు గ్రంథముల ముద్రణ కూడ జరుగుటచే భారతీయ మహాశిల్పము నందలి మిగిలిన భాగముల ముద్రణ ఆలస్యమైనది.

మా తండ్రిగారు భారతీయ మహాశిల్పము 14 వ భాగము (చతుర్ధశకళ) ను, "సర్వదేవప్రతిష్ఠా యజ్ఞకల్పః" అను ప్రథమ భాగము గను, "శ్రీ మత్పరశివ విశ్వకర్మాగమోక్త సప్రయోగ సర్వదేవ ప్రతిష్ఠా యజ్ఞకల్పః" అను ద్వితీయ భాగముగను రచించిరి. నేను ఆ రెండు భాగములను ఈ గ్రంథముగ ముద్రించుట జరిగినది. అత్యంత శ్రమకోర్చి యీ గ్రంథ ముద్రణను పూర్తి గావించిన న్యూ విజయా ఆర్టు ప్రెస్, తెనాలి వారికి, ఈ గ్రంథ ముద్రణకు నన్ను ప్రోత్సహించిన పురోహితులకు నా కృతజ్ఞతలు తెలియ జేయుచు వారిని విశ్వకర్మ భగవానుడు ఆశీర్వదించుగాక ! అని కోరుచున్నాను.

డా॥ స్వర్ణ వాచస్పతి
అధ్యక్షులు-రుద్రకవి సాహిత్య పీఠము
బ్రహ్మర్షి యలవర్తి అంజనేయశాస్త్రి వేద సంస్కృత పాఠశాల
గాంధినగర్ - తెనాలి-522 201.



గ్రంథకర్త:

విమర్శకాచార్య, శిల్పకళాకోవిద

కీ॥ శే॥ స్వర్ణ సుబ్రహ్మణ్యకవి గారు



ప్రచురణ కర్త :

డా॥ స్వర్ణ వాచస్పతి, లక్ష్మీనరసమ్మ

అధ్యక్షులు. – రుద్రకవి సాహిత్య పీఠము

బ్రహ్మర్షి యలవర్తి ఆంజనేయశాస్త్రి వేదసంస్కృత పాఠశాల

గాంధీనగర్ - తెనాలి - 522 201.

అడ్రసు :

రిటైర్డు వెటరినరీ అసిస్టెంటు సర్జన్

నారాయణపురం, దాచేపల్లి - 522 414

గుంటూరు జిల్లా. ఫోన్ (08649) 57902.

శ్రీరస్తు

శ్రీ విరాడ్విశ్వకర్మణేనమః

# సర్వదేవ ప్రతిష్ఠా యజ్ఞకల్పః ప్రారంభః

శ్రీకరం పరమాత్మానం విశ్వకర్మాణ మీశ్వరం,
గాయత్రీం వేదజననీం వందే సర్వార్థసిద్ధయే ॥
అహోభూనాన్వవాయేన శ్రీకోటేశ్వరసూనునా,
సుబ్రహ్మణ్యేనవిదుషా మయోఽద్యయజ్ఞ సంగ్రహః ।
ఆగమోక్త ప్రకారేణ క్రియతే నృహితాయవై,
మండపస్యవిధింపూర్వం కుర్యాచ్ఛుభదినేబుధైః ॥
"ప్రాసాదాదగ్రహేశానే చోత్తరే యజ్ఞమండపం,
హస్తమానాత్ పంచసప్త నవచైకాదశాంతరం ।
త్రయోదశతథాహస్త షోడశాథ తథోత్తమం,
చతురస్రాంసమంశుద్ధం భుజకర్ణవిశోధితం ॥
తథాభిత్తిపుటం కృత్వా నవాంశాం మధ్యవేదికాం,
షోడశస్తంభసంయుక్తం చతుర్ద్వారోపశోభితం।
తారత్ర్యంశోన్నతా వేదీ దర్పణోదరమస్తకా,
పృథక్ప్రవిదితేస్థానే మండలంచ సముద్ధరేత్ ॥
ఉదయార్థాంతరే వేద్యాః కరమాత్రంచ విస్తృతం,
కుండకాని తథాదిక్షు కర్తవ్యాని క్రమేణతు ।
వితానే పుణ్యకలశాః పద్మపుష్పోపశోభితాః,
విదిక్షుదిక్షుమధ్యేచ ధ్వజమాలాకులం తథా ॥
మండపస్య చతుర్ద్వాఃసు లలాటోచ్ఛ్ర యతోరణం,
ప్లక్షోదుంబరన్యగ్రోధాఽశ్వత్థ చూతాదయః క్రమాత్ ।
తత్రతాకృష్ణమయాంకుర్యాత్ స్తంభాన్ నైతోరణోదయే,
ఉత్తరాంగే త్రిశూలాని కర్తవ్యాని నిక్రమేణతు ॥

ఇంద్రగోపోపమాః కృష్ణాః పీతాః సర్షపపుష్పవత్,
శ్వేతాశ్చైవ పతాకాశ్చ పూర్వాదిక్రమయోగతః ।
మధ్యేచసర్వవర్ణాశ్చ పతాకాశ్చ సముచ్ఛ్రయేత్,
వితానైర్వివిధాకారైః పద్మపత్రోపశోభితైః ॥
మండపం దివ్యమాఖ్యాతం పురేచనిలయోపమం,
చతుఃకర్ణేషు వేద్యాశ్చ షడంశోన్నత వేదికాః ।
వాసాముత్తరపార్శ్వేతు కుర్యాద్వైస్నానమండపం,
కార్యంచ కామదంమూలం మండపస్య విభాగతః ॥"

(ఇతి యజ్ఞమండపాధికారః,అపరాజితపృచ్ఛ 147వ సూత్రం)

తత్రవై షోడశ స్తంభైర్హరితైర్మండ పంవృతం,
తిర్యక్ స్తంభైః షోడశకైర్భూషైరాచ్ఛాదనార్థకైః ।
చతుర్భిః కటకంమధ్యేకార్యం కుంభద్వజాశ్రయం,
ఆచ్ఛాదయేద్రక్తవస్త్రైః శ్వేతైర్వాతృణపల్లవైః ॥
శిరోధ్వజపతాకాభ్యాం స్వర్ణకుంభేనశోభితం,
ఉత్తరస్యాంచ పూర్వస్యాం దక్షిణస్యాంతథాపునః ।
పశ్చిమాయాం శంఖచక్ర గదాపద్మాది సంయుతం,
దశదిక్షుద్వారపాణాం పతాకాధ్వజవాహనైః ॥
శస్త్రైశ్చశోభమానంత త్పూర్వాదిక్రమతో యథా,
పీతారక్తా తథాకృష్ణా కృష్ణా శ్వేతాపునర్యథా ।
ధూమ్రవర్ణాస్వర్ణవర్ణా రక్తాభారక్తవర్ణికా,
మేఘాభాఽస్రపవారుణ్యో ర్మధ్యేధ్వజపతాకయోః ॥
వర్ణేనతుల్యావాజ్ఞేయా వాహనాని పునర్యథా,
హస్తీ మేషోలులాయశ్చ కపోతోమకరస్తథా ।
హరిణోనర యానశ్చ వృషోహంసోహయోదశ,
శస్త్రాణిక్రమతోవక్ష్యే వజ్రమగ్నిశిఖాపునః ॥

దండః ఖడ్గశ్చపాశశ్చ శూలంగ దాత్రిశూలకం,
కమండలుః శంఖచక్ర గదాపద్మాయుధం పునః ।
మధ్యేమహాధ్వజోహంస గరుడోక్షాదిభిర్యుతః,
బ్రహ్మావిష్ణు శివాదీనాం స్థాపనే క్రమతస్తథా ॥
మండపాంతశ్చ తుష్కోణే చతస్రో వేదికాస్తథా,
తారత్ర్యం శోన్న తాముధ్యే షడంశాఃకర్ణవేదికాః ।
మధ్యవేద్యాముదగ్భాగే సర్వతోభద్రమండలం,
విలిఖేత్సర్వతోభద్రం వేదికోపరిసుందరం ।
తిర్యగూర్ధ్వగతా రేఖాః కుర్యాదేకోనవింశతిః,
ఖండేందు స్త్రిపదఃకోణే శృంఖలాః పంచకోష్టకాః ।
ఏకాదశపదావల్లీ భద్రంతునవభిఃపదైః,
చతుర్వింశత్పదావాపీ వింశత్యాపరిధిః పదైః ।
మధ్యేషోడశభిః కోష్టైః పద్మమష్టదళం లిఖేత్,
శ్వేతేందుః శృంఖలాకృష్ణా వల్లీనీవేన పూరయేత్ ।
భద్రారుణా సితావాప్యః పరిధిః పీతవర్ణకః,
బాహ్యాంతరదళైః శ్వేతైః కర్ణికాః పీతవర్ణికాః ।
ఖండేందుః శృంఖలావాపి వల్లీభద్రంతు పంచమం,
పరిధ్యావేష్టితం సర్వం బాహ్యాసత్త్వం రజస్తమః ।
సర్వం తత్ర సముద్దిష్టం సర్వతోభద్రమండలం,
“విదిక్షుదిక్షుకుండాని కర్తవ్యాని క్రమేణచ ।
ఉదయార్ధాంతరేవేద్యాః కరమాత్రశ్చ విస్తరః,
హస్తమాత్రంఖనేత్కుండం విస్తృతం హస్తమేవచ ।
మేఖలాత్ర్యంగుళైశ్చైవ కర్తవ్యాక్రమ యోగతః,
తథాశ్వత్థదళాకారా కుండనాభిశ్చవిస్తృతా ॥
ఉత్తరాభిముఖం కృత్వా గజోష్ట్రసదృశాననా,
కుండయోనిస్తుకర్తవ్యా సర్వకామఫలప్రదా ।

ఇత్థంగుణాః సమాఖ్యాతాః కుండదోషానథశ్శృణు,
ఉత్తానమర్ధనాశం చ తథా చింతామధోముఖం ॥
వికర్ణం రోగబాహుల్య మితిదోష స్తథాస్మృతాః,
చతురశ్రం భవేత్పూర్వే ఆగ్నేయ్యాంచభగోపమం ।
అర్ధచంద్ర సమంయామ్యే పంచకోణం తునైరృతే,
వారుణేవర్తులాకారం వాయవ్యేరసకోణకం ॥
సౌమ్యేపద్మదళాకార మైశాన్యాం చాష్టకోణకం,
మధ్యేచదర్పణాకారం కుండాన్యేతానివైనవ ।
సాధారణేషుయజ్ఞేషు శస్యతే కుండపంచకం,
ఆదాచాయుతహోమేతు కుండంచైకకరం స్మృతం ॥
గ్రహాదిసర్వపూజాసు కుండంస్యాదేకహస్తకం,
అంగులత్రయతోవృద్ధిః శూద్రాదేర్బ్రాహ్మణాంతతః ।
ఏకకుండం స్థండిలంవా మండలాదుత్తరేపునః,
మండపాంతశ్చతుర్దిక్షు దేవానాం స్థాపనం యథా ॥
ఐశాన్యాంగణనాథస్య కలశస్యాఖండదేవతా,
పూజాస్థానవిశుద్ధ్యర్థం పంచగవ్యేనప్రోక్షయేత్ ।
తస్మిన్ పీఠం నిధాయాదౌ నిక్షిపేత్ స్వర్ణయంత్రకం,
తస్యోపరిన్యసేద్వస్త్రం గోధుమైర్వ్యాసతండులైః ॥
మధ్యేవలయంకృత్వా తద్బహిః క్రమత స్తథా,
పంచకోణ సమాయుక్తం పంచవర్ణైశ్చ శోభితం ।
షడావరణసంయుక్తం బహిర్వృత్తం తతః క్రమాత్,
బహిరంతః శ్వేతవర్ణం బ్రహ్మమండల మీరితం ॥
పీఠం ప్రపూజయేత్పశ్చాత్ న్యసేద్దేవం విధానతః,
శుద్ధోదక సమాకీర్ణం కలశం పంచపల్లవైః ।
పంచరత్న సమాయుక్తం పంచధాన్యోషధీయుతం,
పంచమృతాన్న సమాయుక్తం పంచవర్ణాంబరావృతం ॥

గంధాద్యలంకృతం సమ్యక్ కంకణేన సమన్వితం,
వరుణం పూజయేత్తత్ర పంచదేవాన్ క్రమాత్తతః ।
సానగాదిమహర్షీణాం పంచకేన యుతంపునః,
శక్తీనాం పంచకం చాపి పంచబ్రహ్మసమన్వితం ॥
పంచదేవీ సమాయుక్త ముపబ్రహ్మర్షి వేష్టితం,
పంచవింశత్యధిశత సంఖ్యాకం చతద్దైవహి ।
దేవీనామన్వితం బాహ్యే పంచభూతసమన్వితం,
పంచవక్త్రసమోపేతం గాయత్రీ సహితేశ్వరం ॥
విశ్వకర్మాణమావాహ్య యఇమేత్యాదినాయజేత్,
అష్టాక్షరేణ మంత్రేణ పూజయేచ్చైవపాదకం ।
సాంగంసావరణందేవం లోకానామీశ్వరంప్రభుం,
సువర్ణప్రతిమాపూజ్యా హ్యుపచారైర్ద్విరష్టభిః ॥

వసిష్ఠఉవాచ :

విశ్వకర్మముఖోద్భూతా బ్రాహ్మణాః పంచకీర్తితః,
సద్యోజాతముఖేజాతో సానగో విశ్వకర్మణః,
వామదేవముఖే జాతో బ్రహ్మర్షి స్సనాతనః ।
అఘోరముఖ సంజాతోఽహభూనోవిశ్వకర్మణః ।
తత్పురుషేముఖోజాతః ప్రత్నోఽసౌ విశ్వకర్మణః,
తస్యేశానముఖేజాత సుపర్ణామీశ్వకర్మణః ॥

(వసిష్ఠపురాణము 3 కాం. 6వ అధ్యాయం)

నైవేద్యం భక్తితోదద్యాత్ పాయసాన్నాదిసంయుతం,
పాలికాః పూజనంకుర్యా దాగ్నేయామాతృమండలే ।
గణేశశ్రీయుతాః స్థాప్యా స్తథా షోడశమాతృకాః,
వసోర్ధారాఘృతాక్తాచ రక్షికాః పంచసప్తవా ॥
తత్రైవాభ్యుదయస్థానం పిత్రూణాం తృప్తిహేతవే,
మధ్యవేద్యామవాగ్భాగే స్థాపయేద్వాస్తుదేవతాః ।

ఏకాశీతిపదైః స్థాప్యా శ్చత్వారిం శశ్చపంచచ,
చరకాద్యష్టదశచ లోకపాలాస్తు తత్ర చ ।
నైరృత్యాం యోగినీ వేద్యాం చతుః షష్టిచయోగినీః,
వాయవ్యాం స్థాపయేద్వేద్యాం ద్విపంచాశతి భైరవాన్ ॥
ఊనపంచాశన్మితా వై మరుతాంతుగణా స్తథా,
స్థాప్యాగోధూమపుంజేషు తండులేషు చ వైపునః ।
తతః సులగ్నే సుధియా సపత్నీకేన కర్మణః,
కర్తా సక్త్వాషధిజలైః హరిద్రా తైలసంయుతైః ॥
"యత్ త్వగ స్థి కృతంపాపం దేహేతిష్ఠతిమామకే,
ప్రాశనాత్పంచగవ్యస్య దహత్యగ్నిరివేంధనమ్ ॥
మలస్నానంచ కర్తవ్యం శుద్ధిస్నానం పునఃపునః,
పంచగవ్యాశనంకృత్వాఽఽచమనం ముఖమార్జనం ।
అపవిత్రః పవిత్రోవేత్యాత్మానం ప్రోక్షయేత్సుధీః,
మండపాంతః ప్రవిశతి చాగ్నేయ్యాం మాతృమండలం ।
గణేశం పూజయిత్వాఽథ గణేశశ్రీయుతాః పునః,
మాతృకాః పూజయేత్పశ్చా ద్ఘృతమాతృాఃపునర్యజేత్ ॥
నాందీశ్రాద్ధంచ కృత్వాఽథాచరేత్పుణ్యాహవాచనం,
పుణ్యాహవాచనస్యాదా వాచార్యం బ్రహ్మచర్త్విజః ।
వృత్వాపుష్పఫల ద్రవ్యేణ శాస్త్రోక్తేన యథావిధిః,
వస్త్రయుగ్మంతథోష్ణీషం కుండలే కంఠభూషణం ॥
అంగుళీభూషణంచైవ మణిబంధస్య భూషణం,
ఏతానిచైవసర్వాణి ప్రారంభే ధర్మకర్మణాం ।
పురోహితాయదత్వాఽథ ఋత్విగ్భ్యః సంప్రదాపయేత్,
సంపూజ్య మధుపర్కేణ ఋత్విజః కర్మకారయేత్ ॥
"బ్రహ్మాచార్యఋత్విజశ్చ ద్వారపాలా స్తథాపరే,
చత్వారఇతి కుండేషు ఋత్విజశ్చైవషోడశ ।

అష్టౌతుద్వారపాలాశ్చ దిశాం పాలాస్తథోత్తమాః,
ఏవం విధః ప్రకర్తవ్యోమండపేతు మహోత్సవః ॥
(అపరాజితపృచ్ఛ 117వ అధ్యాయం)

అపూజ్యకారయేత్కర్మ కిల్బిషేణచయుజ్యతే,
యజమానోఽథవృత్త్యేవం బ్రాహ్మణాన్ప్రార్థయేత్తదా ।
అస్యయాగస్య నిష్పత్త్యై భవంతోఽభ్యర్థితామయా,
సుప్రసన్నైః ప్రకర్తవ్య మేతత్కర్మ యథోదితం ॥
మిలిత్త్వైర్బ్రాహ్మణైఃకార్యం యజమానకరేపునః,
రక్షాబంధనమేతద్ధి కంకణం శాస్త్రభాషితం ।
దూర్వాయవాం కురాశ్చైవ బాలకం చూతపల్లవాః,
హారిద్రాద్వయసిద్ధార్థ శిఖిపక్షోరగత్వచః ॥
కంకణౌషధయశ్చైవాః కౌతుకాఖ్యాసనస్మృతాః,
భాజనస్థాన్ కరపుటే ధృత్వామంత్రాన్ పఠేత్తథా ।
గణాధిపం నమస్కృత్యే త్యాదిరక్షోహణాం స్తథా,
దిగ్బంధే చ తథాజాతే యజమానకరే పునః ॥
రక్షాబంధనమే తత్స్యాత్ కంకణే చసుమంత్రితం,
తిలకంచ ప్రకర్తవ్యం తతః పుణ్యాహవాచనం ।
పుణ్యాహవాచనాంతేచ శ్రీఫలేనైవ సంయుతం,
సపత్నీకస్తదాధాన్య పుంజేకుంభంచ స్థాపయేత్ ॥
గంధాక్షతైః పుష్పఫలైః పంచపల్లవచందనైః,
వేష్టితం రక్తవస్త్రేణ రక్షకాభిస్తుమాలయా ।
శోభితం పూజయేత్తత్ర స్మృత్వాగణపతిం తదా,
కుంభోపరిగ్రహాన్ దేవాన్ వరుణం చ ప్రపూజయేత్ ॥

పంచగవ్యప్రోక్షణం చ వికిరేత్సర్షపాంస్తథా,
వేదఘోషం చ శృణ్వాన స్తూర్యఘోషేణ సంయుతం ।

మండపం దక్షిణీకృత్య ప్రవిశేద్వాస్తు పశ్చిమం,
మండపాం వర్ధాన్యపుంజే కుంభంధృత్వాఽథ పూజయేత్ ।
మండపాంగస్య శుద్ధించ కృత్వా పురుషసూక్తతః,
ఆచార్యస్తుస్వహస్తేన వికిరేద్గౌరసర్షపాన్ ॥
పంచగవ్యప్రోక్షణం చ ప్రోక్షణం చ కుశోదకైః,
మండపే మధ్యస్థూణాతః పూజాస్నానం చ గంధతః ।
ద్వారతోరణయోః పూజాం కృత్వాధ్వజపతాకయోః,
ద్వారేషుస్థాపయేత్కుంభాన్ వేదపాఠసమన్వితాన్ ॥
దశదిక్పాలకాః పూజ్యాః స్తత్తన్మంత్రైశ్చ సర్వశః.
దేవయోన్యోబవిర్దేయో మంత్రోచ్చారణ పూర్వతః ।
మండపస్యశిరోదేశే పూజితవ్యో మహాధ్వజః,
ఐశాన్యాం సర్వభూతేభ్యో బలిందత్వాఽథ పూజయేత్ ॥
మండపస్యతుప్రాగ్దేశే పూజ్యాః సర్వేచస్థిరాః,
వివిధా దేవతాః పూజ్యాః బలిందత్వా సఋత్విజః ।
పూర్వద్వారాత్ప్రవిశ్యాథ వాస్తుమండలపశ్చిమే,
ఉపవిశ్యచతుష్కోణేష్వయః కీలాంశ్చస్థాపయేత్ ॥
ఐశాన్యాంగణపత్యాదిగ్రహాస్తదధిదేవతాః,
ప్రత్యధిదేవతాఃపంచ వినాయకాదయోదశ ।
లోకపాలాః పూజితవ్యాః కలశేవరుణం తథా,
మధ్యమేవాస్తుదేవానాం శిఖ్యాదీనాంచ పూజనం ॥
బలిందత్వా తవోరేఖాః దశపూర్వాయతాః క్రమాత్,
దశోత్తరాయతారేఖాః కల్పయేద్వాస్తుసిద్ధయే ।
కలశస్థాపనం పూర్వం శంకూనాం తోరణంపునః,
బలిదానంపాయసేన నైరృత్యాం యోగినీగణాన్ ॥
మరుతోభైరవాణాం చ వాయవ్యాం పూజనం తథా,
పంచభిశ్చ ప్రకర్తవ్యం మధ్యేమండలదేవతాః ।

ప్రధానకలశేపూజ్యాః రుద్రా బ్రహ్మాదయ స్తథా,
మధ్యవేదీం సమాసాద్య నానాలంకారశోభితాం ।
తస్మిన్ పీఠం నిధాయాదౌ న్యసేద్వస్త్రం తదోపరి,
గోధుమైర్వా తండులైర్వా పంచబీజాక్షరాన్ లిఖేత్ ॥
పీఠం ప్రపూజయేన్ముఖ్య దేవరూపం న్యసేత్తదా,
శుద్ధోదక సమాకీర్ణం కలశం పంచపల్లవైః ।
నవరత్నసమాయుక్తం నవధాన్యౌషధీయుతం,
నవమృత్స్నా సమాయుక్తం సర్వవర్ణాంబరావృతం ॥
గంధాద్యలంకృతం సమ్యక్ కంకణేన సమన్వితం,
పుష్పమాలాది సంయుక్తం సర్వాలంకారశోభితం ।
వరుణం పూజయేత్తత్ర శాంతిమంత్రైస్తథైవచ,
ప్రధానదేవమావాహ్య పూజయేచ్చయథావిధిః ॥
"అథాతస్సంప్రవక్ష్యామి ప్రతిష్ఠాలక్షణం క్రమం,
దేవానామపి దేవీనాం భక్తానాం వాహనస్యచ ।
లింగానాం లోహదారూణాం శర్కరామృద్వికారిణాం,
సుధానాం చిత్రకానాంచ వాస్తుశాస్త్రార్థపారగైః ॥
కర్తవ్యం వాస్తుశాస్త్రోక్తం రాజారాష్ట్రం సుఖంభవేత్,
కాలవృష్టిర్భవేద్భూమా ధనధాన్య సమృద్ధయః ।
గావశ్చసుదుఘానిత్యం జరారోగవివర్జితాః,
వాస్తుశాస్త్రక్రియాహీనం కర్తృనాశం కులక్షయం ॥
తత్సర్వం వాస్తురూపంచ శిల్పిజీవితముచ్యతే,
విశ్వకర్మబ్రహ్మకులో వేదశాస్త్రార్థపారగః ।
అరోగీరూపసంపన్నః సత్యవాగ్ధర్మపారగః,
మంత్రతంత్ర క్రియాభిజ్ఞః కుటుంబీసత్కులోద్భవః ॥
వేదశాస్త్రార్థపారీణః నిత్యకర్మరతః శుచిః,
ప్రతిష్ఠాకర్మకుశలః శాంతస్సజ్జన సంస్తుతః ।

బ్రహ్మజ్ఞానిజపేశక్తః సూత్రగ్రాహీ శుభాన్వితః,
వేదోక్త కర్మనిరతః కాలజ్ఞః సర్వశాస్త్రవిత్ ॥
ఏవంవిధ గుణోపేతః శిల్పికల్ప్యాత్ ప్రయత్నతః,
స్నానం సంధ్యాజపోహోమః స్వాధ్యాయః పితృతర్పణం ।
ఆతిథ్యం వైశ్వదేవంచ అష్టకర్మాణ్యకారయత్,
కేయూరహారమకుటైః కంకణైరుపశోభితః ॥
వ్యజనైః కేతుభిశ్ఛత్రైశ్చామరైశ్చ విరాజితః,
యజమానాదిభిస్సర్వైస్సేవ్యమానోజనైరపి ।
బింబం ప్రదక్షిణం కుర్యాత్ నృత్యగీతాదిభిస్సహ,
ప్రవిశ్యశిల్పగేహంచ పంచసూత్రైరనూత్తమైః ॥
పుణ్యాహం వాచయిత్వాఽథ చాంకురార్పణమాచరేత్,
ద్వితీయం జలవాసంచన్న పనంశిల్పకోవిదైః ।
పంచగవ్యైః పంచామృతైః పంచత్వక్పంచపల్లవైః,
తృతీయం క్షీరవాసంచ చతుర్థం ధాన్యవాసకం ॥
పంచమోవాస్తు హోమశ్చ బలిఃశాంతాఖ్యకర్మచ,
షష్ఠంచమూర్తిహోమశ్చ సప్తమం శిల్పిభోజనం ।
పుణ్యాహం దశశాంతిస్స్యాదష్టమందేహశుద్ధికం,
నవమోగర్భవిన్యాసః దశమోరత్నసంస్థితిః ॥
ఏకాదశంపీఠబంధః శకునైస్సప్తమంత్రకైః
పరిణీయాలయం బింబంకారయిత్వాప్రవేశనం ।
కర్తవ్యం శుభలగ్నేచ ద్వాదశం చాష్టబంధనం,
పంచసూత్రైః ప్రలంబశ్చ అభిషేకం త్రయోదశః ॥
అసునీతేతిసూక్తేన ప్రాణప్రతిష్ఠామాచరేత్,
బింబంపూరుషసూక్తేన చార్చయిత్వా యథావిధిః ॥
న్యాసం నారాయణంసూక్తం కుర్యాద్ధ్యానం చతుర్దశం,

నేత్రమోక్షం పంచదశేః మంత్రపుష్పం తుషోడశేః,
ధ్వజారోహం సప్తదశేః వివాహస్తదనంతరం ।
అష్టాదశరథారోహః కర్మాణ్యష్టాదశః క్రమాత్ ॥
(వాతూలాగమం ప్రతిష్ఠాలక్షణం)

తతోదీచ్యామగ్నికుండే వహ్నిస్థాపనపూర్వకం,
వేదమంగళఘోషైస్తు పూజాకార్యాతదంతరే ।
త్రిసూత్ర్యాస్తనకుంభ్యా చధారాదుగ్ధేనవారిణౌ,
రక్షోఘ్నేనచ సూక్తేన పావమానేన మండలే ॥
ప్రాసాదేమందిరే చైవప్రాగాదితస్తు వేష్టనం,
త్రిసూత్ర్యాచైవకర్తవ్యం హోమకర్మసమాచరేత్ ।
గ్రహేభ్యో నవభ్యశ్చాధి దైవప్రత్యధిదేవతాః,
వినాయకాది పంచభ్యో లోకపాలేభ్య ఏవచ ॥
అష్టోత్తరసహస్రేణ వాష్టోత్తరశతానిచ,
అష్టావింశతి నావాష్టా హుతిభిర్జుహుయాత్పునః ।
విశ్వకర్మాదిమంత్రైశ్చ సహస్రం జుహుయాద్బుధః,
గాయత్రీ మూలమంత్రేణ సహస్రం తుతథాపునః ॥
పంచబ్రహ్మాదిసర్వేభ్య అష్టోత్తరశతం మితం,
శిఖ్యాదిభ్యో వాస్తుపీఠదేవతాభ్యస్తథైవచ ।
ఔదుంబరసమిద్భిశ్చతి లాజ్యపాయసైస్తథా,
వాస్తోష్పత ఇతిపంచ ఋగ్భిర్బిల్వాది పంచభిః ॥
సూర్యాదీనాం సమిద్భిశ్చ వారాకాదినవభిస్తథా,
ప్రధానదేవముద్దిశ్య జుహుయాచ్చందనేంధనైః ।
ఏవం హోమం సమాప్యాథ గత్వాయజ్ఞకుటింపునః,
అథాచార్యః స్విష్టకృద్ధి హోమశేషం సమాసయేత్ ॥
తతస్తువై దిశేశీభ్యో గ్రహేభ్యోనవభ్యస్తథా,
ప్రధానదేవవాస్తూపదేవతాభ్యస్తథైవచ ।

బలిదానం దీపదధిమాషభక్తయుతం స్మృతం,
క్షేత్రపాలాయచ చతుర్ముఖదీపయుతంతథా ॥
తతఃపూర్ణాహుతిర్దేయా పూర్ణపాత్రవిమోచనం,
స్రువేణభస్మసంగృహ్య తదగ్రేవహ్నిపూజనం ।
యజమానస్యాభిషేకం సపత్నీకస్యకారయేత్,
దూర్వాభిస్సర్త్విగాచార్యః సమస్తకలశోదకైః ॥
తదగ్రేఽవభృథస్నానం వస్త్రాభరణ సంయుతం,
ఆశిషోఽథగృహీత్వాత్వా చార్యాదీనాంచ పూజనం ।
హస్త్యశ్వరథవస్త్రైశ్చ గోభూమిరజతాదిభిః,
సహస్రదక్షిణాద్యైశ్చ పూజయేద్విధివద్ద్విజాన్,
అథాచార్యాదయోవిప్రాః ఫలమార్వాక్షతైర్యుతాః ॥
యజమానాయాశిషోదద్యుర్దక్షిణాది తృప్తాః,
అనేనవిధినాయస్తు గ్రామేవాపత్తనేఽపివా ।
ప్రతిష్ఠాదిషుసర్వేషు కుర్యాత్సఫలమాప్నుయాత్,
నదుఃఖం వ్యాధిజంభీతిర్నచ బంధుధనక్షయః ॥
జీవేద్వర్ష శతం స్వర్గే కల్పమేకం వసేన్నరః,
తస్మిన్నుపద్రవా సర్వేనసంతి ఖలుసర్వదా,
కర్తాసుశ్రియమాప్నోతి సుభిక్షం లభతేపురీ ॥

దేవతాముఖములు

"దక్షిణస్యాం నకుర్వీత త్రిదశానప్యుదఙ్ముఖాన్"
(సమరాం 10 ప్ర. 113 శ్లో.

## పుండ్ర విధి (ధర్మవృత్తౌ)

త్రిపుండ్రం సురవిప్రాణాం వర్తులం నృపవైశ్యయోః,
అర్ధచంద్రంతు శూద్రాణా మన్యేషామూర్ధ్వ పుండ్రకమ్ ।

బ్రాహ్మణానాం నృపాణాంచ భస్మమిశ్రంచ చందనం,
నేత్రయుగ్మప్రమాణంతు త్రిపుంగ్రడం ధారయేత్ ద్విజః ।
మధ్యమానామకాంగుష్ఠై ర్లలాటే యత్త్రిపుండ్రకం,
తత్ త్రిపుండ్రం భవేచ్ఛ్రస్తం మహాపాతక నాశనమ్ ॥

కోదండరామన్ సన్నిధి. యస్ ఆర్, విజయరాఘవ అయ్యంగారు
122. ఉత్తరచిత్రాబజారు, శ్రీరంగం - తిరుచ్చి.

శ్రీపాంచరాత్రే పారమేశ్వర సంహితాయాం ।
క్రియాకాండే పంచదశోఽధ్యాయః ॥
"ప్రతిష్ఠాదివసాత్పూర్వం తృతీయే పంచసప్తమే ।
దినేఽపరాహ్ణసమయే కర్మశాలాం ప్రవిశ్యచ ॥ (222)
అస్త్రమంత్రేణ సంప్రోక్ష్య బింబంసంతాడయేత్తతః ।
సిద్ధార్థకైస్త్రివై ర్దర్భై ర స్త్రమంత్రాభిమంత్రితైః ॥ (223)
సస్నాస్యాకారశుద్ధ్యర్థం షడ్భిఃసిద్ధార్థకాదికైః ।
వస్త్రాభరణపుష్పాద్యై రలంకృత్యేచ భూషణైః ॥ (224)
పూర్వవత్ కౌతుకంబధ్వా సమారోప్యరథాదికే ।
పూర్వవచ్ఛ్ఛ ఘోషైశ్చ శంఖభేర్యాదిభిస్సహ ॥ (225)
వివిధై ర్నవిత్తుగేయైశ్చ తథానై ర్మంగళైస్సహ ।
గ్రామంవానగరంవాపి ప్రాసాదంచ ప్రదక్షిణం ॥ (226)
భ్రామయిత్వాజలోద్దేశ మానయేన్మూర్తిపైః సహ ।
ప్రపాయాంతుజలాభ్యర్ణే ఆవరోప్యరథాదికాత్ ॥ (227)

శ్రీరస్తు

శ్రీపరశివవిశ్వ కర్మాగమము ప్రధానముగను, కాశ్యపశిల్పము, విశ్వకర్మీయశిల్పము, మానసారము, అపరాజితపృచ్ఛ, మయశిల్ప శాస్త్రము, విశ్వకర్మప్రకాశ, సమరాంగణసూత్రధార, వాస్తు ప్రతిష్ఠాసంగ్రహము, గార్గేయాగమము, వాతూలాగమము, నారదీయ శిల్పము, అగ్నిపురాణము, సారస్వతీయశిల్పము, బ్రహ్మాండపురాణము, స్కాందపురాణము, పద్మపురాణము, వసిష్ఠపురాణము, శివపురాణము, సప్రయోగ పూర్తచంద్రిక, సర్వదేవ ప్రతిష్ఠా సంగ్రహము మున్నగు నానాగ్రంథములను పరిశీలించి సర్వదేవ ప్రతిష్ఠా యజ్ఞకల్పము వ్రాయబడుచున్నది.

శుభదినమున యజమానుడును తన భార్యయును పంచగవ్యములతోను శుద్ధోదకముతోను స్నానముచేసి వస్త్రభూషణాద్యలంకృతులై శుభవాద్యములతో గూడి పత్నియంచలకోణమున రక్తాక్షతలు పసుపుగరిక ఖర్జూరఫలము తాంబూలము కట్టించి తనయెడమవైపున గూర్చుండబెట్టుకొని యిష్టదేవతా ప్రార్థనముచేసి ఆచార్య బ్రహ్మఋత్విజులతోను, బంధుమిత్రాది వర్గములతోను, హరిః ఓం స్వస్తిశ ఇంద్రోవృద్ధశ్రవాః, అను స్వస్తిమంత్రయుక్తముగ బయలుదేరి భూమిని పరీక్షించి యొక పాడియావును దూడతోగూడ నచట నుంచి సప్తధాన్యములు (పుచ్చినవికాకుండ) ను, బంగారము, ఫలములు, పుష్పములు, శుద్ధోదకము నూతన వస్త్రముతో గూడిన కలశమును ఉంచి ఆచమనముచేసి సంకల్పముచెప్పి గణపతిని పూజించి రక్షాతిలకమునుచేసి అక్షతలను పుష్పములను దోసిటనుంచుకొని అందు మేరుకర్ణికాశోభితమును, శైలవననదీ సమాయుక్తమును, సాగరపరివేష్టితమును అయిన భూమిని ఆవాహనముచేసి షోడశోపచారములతో పూజించవలెను.

దశదిక్పాలుర నావాహనముచేసి ఒక్కొక్కరికి ప్రత్యేకముగ మినుపకుడుములను పెరుగుతోగూడిన యన్నమును దీపసహితముగ బలిని పెట్టవలయును. మరల మినుపకుడుములును పెరుగుఅన్నమును దీపసహితముగ సూర్యాది నవగ్రహములకు బలిని పెట్టవలయును. మూడవసారి వాస్తుపురుషునకు మినుపకుడుములను పెరుగు అన్నమును దీపసహితముగ బలిని పెట్టవలయును. ఒక పాత్రయందు నీళ్లు గంధము పుష్పములుచేర్చి అర్ఘ్యమీయవలెను. యజ్ఞమండప స్తంభములకు ఖాతస్థానములను నిర్ణయించి ఆస్థానములను దర్భలతో పంచగవ్యములతోను పంచామృతములతోను ప్రోక్షించవలెను. గంధాదులతో పూజించవలెను. అర్ఘ్యపాత్రయందు పుష్పములను అక్షతలనుఉంచి రెండుచేతులతో పట్టుకొని అర్ఘ్యమును వదలవలెను. పుష్పాంజలితో పాయసము పిండివంటలు పేలపిండి మొదలైనవి భూమికి బలిని పెట్టవలెను. అంతట శిల్పాచార్యుని గంధాదులతో బూజించి ఆయనచేత క్రమమైన కొలతలు చేయించవలెను. ఆధారశక్తికిని, కూర్మమునకును, అనంతునకును, భూమికిని, వాస్తుపురుషునకును, ఇష్టకాదేవతలకును, నమస్కరించి వేదికోణములయందు ఇటుకలనుంచవలెను.

తరువాత శిల్పాచార్యుడును, యాజ్ఞికుడును, దర్భచాపపై పరుండవలెను. లేకువజామునలేచి ఆనారాత్రివచ్చిన స్వప్నమును బట్టి శుభాశుభములను దెలిసికొనవలెను. అంతట తూర్పుదిశ నిర్ణయమునకు సూర్యుడు కన్యారాశియందుండగాగాని, లేక మేష వృషభరాసుల యందుండగాగాని, కృత్తికా నక్షత్రమును జూచిగాని, శ్రవణ నక్షత్రమునుజూచిగాని, చిత్తాస్వాతీ నక్షత్రముల యొక్క మధ్యను నిర్ణయించుకొని తూర్పును తెలిసికొనవలయును. లేక ధ్రువనక్షత్రమునుజూచి ఉత్తర దక్షిణములను నిర్ణయించి తద్వారా నలుచదరము చేసికొనియైనను, లేక దిక్సూచీవలననైనను

దిశలునిర్ణయించి నలుచదరము చేసికొనియైనను, యజ్ఞశాలను నిర్మించవలెను. దేవాయలమునకుముందు తూర్పుగాని ఉత్తరమున గాని ఈశాన్యమునగాని హస్తమానముతో 5.7.9.11.13.16 గజము లలో నేదియో యొక కొలత ప్రకారం నలుచదరముచేసి మూలలు కూడ సమముగా నుండునట్లుకొలిచి దానిని ఒక్కొక్కవైపు సమముగా 3 భాగములుచేసి నాలుగేసి స్తంభములను నాటవలయును.

ఇట్లు 4 వరుసలు 16 స్తంభములును వానిమధ్య 9 గదులును అగును. దీనికి పీఠము అని వాస్తుశాస్త్రమున పేరుకలదు. ఈ 16 స్తంభములకు కొబ్బరిమట్టలు చుట్టవలెను. లేదా ఒక గజముయెత్తు వఱకు ఆకుపచ్చవన్నెగల నూతన వస్త్రములను చుట్టవలెను. పైన అడ్డముగా ఉత్తరదక్షిణములు 4 న్ను తూర్పుపడమరలు 4 న్ను ఒక్కొక్కప్రక్కను మధ్యద్వారమునువిడిచి యిరువైపుల రెండు కఱ్ఱలను కట్టి మధ్యనున్న నాలుగు స్తంభములనడుమ సువర్ణరజిత తామ్రమృణ్మయములలో నేదియోయొక కుంభమునుంచి యందు శుద్ధోదకము, సమస్తమైన యోషధులు, దర్భలు, పంచపల్లవములు, సువర్ణము, నవరత్నములు మొదలగు వానినుంచి యెఱ్ఱనిదిగాని, తెల్లనిదిగాని నూతన వస్త్రమునుచుట్టి నూతన వస్త్రముచే జుట్ట బడిన యైదువన్నెలుగల జెండాలు 4 స్తంభములకు కట్టవలయును. అచటనిలిపి యజ్ఞమండపమునకు తూర్పున జువ్విమండల తోరణ మును, దక్షిణమున మేడిమండల తోరణమును, పడమర మఱ్ఱి మండల తోరణమును, ఉత్తరమున రావిమండల తోరణమును, మధ్యనున్న 4 స్తంభములకు చుట్టూ మామిడిమండల తోరణమును కట్టి మధ్యనున్న 4 ద్వారములమధ్య తోరణములకు దారువుతో చేయబడిన 4 త్రిశూలములను గ్రుచ్చవలయును. ముఖద్వారమున శంఖమును, పృష్ఠద్వారమున పద్మమును, కుడివైపున చక్రమును, ఎడమవైపున గదయును, నిర్మించవలయును. తూర్పున ఇంద్రునికి

వజ్రాయుధమును, 4 దంతములుగల తెల్లయేనుగను, పసుపువన్నె పతాకయును, ఆగ్నేయమున అగ్నిహోత్రునకు, శక్తియును పొట్టేలును, ఎఱ్ఱనిజెండాయును, దక్షిణమున యమునికి దండమును, దున్నపోతును, నల్లనిజెండాయును, నైరృతిన నిర్ఋతికి ఖడ్గమును, గుఱ్ఱమును, నల్లని జెండాయును, పడమర వరుణునకు వల్లెత్రాడును, మొసలియును తెల్లని జెండాయును, వాయవ్యమున వాయువునకు శూలమును, లేడియును, నలుపుమెఱుపు కలిసిన వన్నెజెండాయును, ఉత్తరమున కుబేరునికి గదయును, పల్లకియును, పసుపువన్నె జెండాయును, ఈశాన్యమున శివునకు త్రిశూలమును, తెల్లనియెద్దును, ఎఱ్ఱని జెండాయును, ఈశానేంద్రులమధ్య బ్రహ్మకు కమండలువు, హంస యును, ఎఱ్ఱని జెండాయును, వరుణ నిర్ఋతులమధ్య అనంతునికి శంఖచక్రగదాపద్మములును, గుఱ్ఱమును, లేతనలుపు వన్నెగల జెండాయును, మధ్యవేదిక చుట్టూ ఈశాన్యమున హంసపతాకను, ఆగ్నేయమున గరుడపతాకను, నైరృతిన వృషభపతాకను, వాయవ్యమున ఐరావత పతాకను నిలుపవలయును. మధ్యపంచవర్ణ మహాపతాకను నిలుపవలెను. మండపముయొక్క మధ్య 4 స్తంభ ములవఱకు వేదిక అందులో 3వ వంతు యెత్తున వేయవలయును. దానికి నాలుగువైపుల మూడేసి మెట్లుండవలెను. ఎనిమిది దిక్కుల చిన్నపీఠము లుండవలెను. నాలుగు మూలలయందు వేదికలు మధ్య వేదికలో సగముండునట్లును అందులో 3వ వంతు యెత్తుండునట్లును నిర్మించవలెను.

మధ్యవేదికపై ఉత్తరభాగమున నూతనవస్త్రముపై బియ్య మునుబోసి యందు సర్వతోభద్రమండలమును లిఖించవలెను. 27 నిలువురేఖలను 27 అడ్డరేఖలనుగీచి యందు మధ్య 16 గదులలో రక్తవర్ణాష్టదళపద్మమును, దానిచుట్టును ఒకగది పసుపువన్నె, 20 గదులు పరిధి. నాలుగుమూలలయందై దేసిగదు లచోప్పున

నలుపుగదులు శృంఖలలు, వాని కిరుప్రక్కల ఆకుపచ్చవన్నెగల 11 గదులువల్లి. వాని చివరగదుల నానుకొని వెలుపలినుండి లోపలికి క్రమముగాతగ్గుచు మెట్లుగానున్న యెఱుపు వన్నెగల 9 గదులు భద్రము. ప్రాగాది నలుదిశలయందు 24 గదులచొప్పున మెట్లుగా గనుపడుచున్న తెలుపువన్నెగదులు వాపి. నాలుగుమూలలయందు వల్లీశృంఖలలమధ్య తెలుపువన్నెగల 3 గదులు అర్ధచంద్రుడు. వాని చుట్టువాఱు ఒకగదివరుస 76 తెలుపుగదులు సత్త్వము. వానిచుట్టు వాఱు 84 ఎఱుపుగదులు రజస్సు. వానిచుట్టు వాఱుకోణముల నానిన గదులు నలుపును మధ్యమధ్య నొక్కొక్కగది తెలుపును కలిగి ప్రాగాది చతుర్దిశలమధ్య రెండేసి గదులచొప్పున తెలుపుగదులును. కూడినమొత్తము 92 గదులలో 44 నలుపును 48 తెలుపును కలిగియుండును. ఇది తమస్సు. ఈ మూడింటికి వరుసగా సత్త్వమునకు శివుడు, రజస్సునకు బ్రహ్మ, తమస్సునకు విష్ణువు అధిపతులు.

ఇది సర్వతోభద్రమండలము. అపరాజిత పృచ్ఛయందు కూడ సర్వతోభద్రమండల లక్షణము చెప్పబడియున్నది. కాని యేదియైననొకటి చాలునుగదా యను నుద్దేశముతో ఆ ప్రకరణము నిందు చెప్పక వదలివేయడమైనది. కుండములు తూర్పుమొదలుగా 8 దిక్కులను మధ్య 1 కలిపి మొత్తము 9 చెప్పబడియున్నది. 1.తూర్పు నలుచదరముగను,2.ఆగ్నేయమున మూడుమూలలుగను, 3. దక్షిణమున అర్ధచంద్రాకారముగను, 4. నైరృతిన ఐదుకోణములుగను, 5. పడమర గుండ్రముగను, 6. వాయవ్యమున ఆఱుకోణములుగను, 7. ఉత్తరమున పద్మదళాకారముగను, 8. ఈశాన్యమున అష్టకోణములుగను, 9. మధ్య వేదికయందు దీర్ఘవలయాకారముగను నిర్మించవలెను.

మరియు ఐదు కుండములు నిర్మించవలసినప్పుడు విదిక్కులను వదలి నాలుగుదిశలయందు మాత్రమే కుండములను రచించి మధ్య

వేదికయందును కుండమును నిర్మించవలెను. మొత్తము 5 అగును. ఏకకుండముతోనే చేయదలచినప్పుడు ఒకహస్త ప్రమాణమున కుండమును ఉత్తరభాగమున రచించవలెను. 3 అంగుళములచొప్పున 3 మేఖలలును సమకోణములును సమతలమును కలిగియుండవలెను లోతు తక్కువయైన ధననాశమును, అధోముఖమైన దుఃఖమును, వికర్ణము రోగమును కలిగించును కనుక శిల్పశాస్త్ర ప్రకారము కుండమును రచించవలెను. వాస్తుశాస్త్రమున దీనికి సకలమనిపేరు. ఈశాన్య వేదికయందు 12 గదుల మండలమును నిర్మించి యందు గణపతిని మాసనామ ప్రకారము షోడశోపచారయుక్తముగ పూజించవలెను. గణపతి సింధూరవర్ణముకలవాడు. ఉపేంద్ర, విఘ్ననాశ, శివసుత, హరనందన, విఘ్నరాజ, మోదకప్రియ, మహావీర, విఘ్నహర్త, గణపతి, వినాయక, గజానన, ఫాలచంద్ర అను నామములు చైత్రాది పదిరెండు మాసములకు చెప్పదగినవి. అధికమాసమునందు విఘ్నహర్త అనునామము నుపయోగించ వలెను. ఎఱ్ఱదామరపూలు, జాజిపూలు, మొగలిపూలు, ఉమ్మెత్త పూలు, మారేడుపత్రి మొదలగువానితో పూజించి ఉండ్రాళ్ళను సమర్పించవలయును. గణపతి వెనుక అక్షతలతో అలంకరించబడిన కలశమునుంచి షోడశోపచారముల పూజించి అఖండమును వెలిగించ వలెను. ఆ విధానమును చెప్పుచున్నాము.

అచట 5 వన్నెల ముగ్గులువేసి యందు పంచగవ్యములను ప్రోక్షించి యచట నొక పీఠమునుంచి యందు నూతన వస్త్రము నుంచి గోధుమలుగాని బియ్యమునుగానిపోసి యామధ్య సువర్ణ యంత్రమును 5.8.16 దళములువరుసగాను, భూపురయుతముగను, శాస్త్రోక్తబీజములతోను, నిర్మించి యచటనుంచి దానిని కేంద్రముగా జేసికొని బ్రహ్మర్షి మండలమును నిర్మించవలెను. మధ్యవర్తులమును, దాని ననుసరించి వరుసగా పంచకోణవలయము లాఱును కడపట

నొకవలయమునురచించి కడపటివలయము మధ్యవలయము తెలుపుగాను, యీరెంటిమధ్యనున్న 6 వలయములును తూర్పు తెలుపు, దక్షిణము నలుపు, పడమర యెఱుపు, ఉత్తరము ఆకుపచ్చ, ఈశాన్యము పసుపు. ఇట్లు 5 వన్నెలుచేసి మొదటి పంచకోణవలయమున ప్రాగాదిగా పంచవేదములను, రెండవవలయమున మనుమయాది స్వరూపులను సానగాది పంచమహర్షులను, వారివారి యెడమవైపు గాకిలక్ష్మివాణీశచీసంజ్ఞాది నామములుగల ఆదిశక్తి మొదలగు పంచశక్తులను, మూడవవలయమునుండి యాఱవవలయమువఱకు ఒక్కొక్కటి నాలుగేసిగదులు చేయవలెను. తెలుపులో బ్రిభ్రాజాది నలుగురును, నలుపులో వామదేవాది నలుగురును, ఎఱుపులో భద్రదత్తాది నలుగురును, ఆకుపచ్చలో రుచిదత్తాది నలుగురును, పసుపులో విశ్వజ్ఞాది నలుగురును, నాల్గవవలయమున నిట్లె వరుసగా తెలుపులో సులక్ష్మి మొదలగు నలుగురు దేవతలను, నలుపులో కటాక్షిణి మొదలగు నలుగురు దేవతలను, ఎఱుపులో నీలవేణి మొదలగు నలుగురు దేవతలను, ఆకుపచ్చలో రక్తాక్షి మొదలగు నలుగురు దేవతలను పసుపులో చంచలాక్షి మొదలగు నలుగురు దేవతలను ఐదవవలయము తెలుపు మొదటిగదిలో మన్వాది పంచర్షులను, రెండవగదిలో సుమంతాది పంచర్షులను, మూడవగదిలో వనజాది పంచర్షులను, నాలుగవగదిలో సుయజ్ఞాది పంచర్షులను, నలుపు మొదటిగదిలో మయాది పంచర్షులను, రెండవగదిలో వర్ధకాది పంచర్షులను, మూడవగదిలో చక్షుషాది పంచర్షులను, నాలుగవగదిలో రైవతమన్వాది పంచర్షులను, ఎఱుపు మొదటిగదిలో త్వష్ట్రాది పంచర్షులను, రెండవగదిలో కేశమన్వాది పంచర్షులను, మూడవగదిలో బోధాయనాది పంచర్షులను, నాలుగవగదిలో ప్రభోన్నతాది పంచర్షులను, ఆకుపచ్చ మొదటిగదిలో ప్రహర్షణాది పంచర్షులను, రెండవగదిలో వాస్తుపురుషాది పంచర్షులను, మూడవగదిలో విశ్వభద్రాది పంచర్షులను, నాల్గవగదిలో శక్వరాది పంచ

ష్ఠులను, పసుపువన్నె మొదటిగదిలో మణిభద్రాది పంచర్షులను, రెండవగదిలో ఆదిత్యసేనాది పంచర్షులను, మూడవగదిలో తేజోధర్మాది పంచర్షులను, నాల్గవగదిలో ఉపకల్పాది పంచర్షులను, ఆఱవవలయము తెలుపు మొదటిగదిలో శ్రద్ధాది పంచదేవతలను, రెండవగదిలో ధృత్యాది పంచదేవతలను, మూడవగదిలో శుచ్యాది పంచదేవతలను, నాల్గవగదిలో కంజవాగాది దేవతలను, నలుపు మొదటిగదిలో పద్మాది పంచదేవతలను, రెండవగదిలో సుగామిన్యాది పంచదేవతలను, మూడవగదిలో సువాగాది పంచదేవతలను, నాల్గవగదిలో వేదిన్యాది పంచదేవతలను, ఎఱుపు మొదటిగదిలో విభావాది పంచదేవతలను, రెండవ గదిలో చారునేత్ర్యాది పంచదేవతలను, మూడవగదిలో సుబోధిన్యాది పంచదేవతలను, నాల్గవగదిలో చిత్రభాషిణ్యాది పంచదేవతలను, ఆకుపచ్చ మొదటిగదిలో సుప్రతీకాది పంచదేవతలను, రెండవగదిలో పావన్యాది పంచదేవతలను, మూడవగదిలో అకుంఠిన్యాది పంచదేవతలను, నాల్గవగదిలో సౌహార్ద్రినత్యాది పంచదేవతలను, పసుపువన్నె మొదటిగదిలో సుఖ్యాది పంచదేవతలను, రెండవగదిలో వనితాది పంచదేవతలను, మూడవగదిలో శ్రీకర్యాది పంచదేవతలను, నాల్గవగదిలో మఘునానాణ్యాది పంచదేవతలను, ఆవాహనముచేసి పూజించవలెను.

తెలుపువన్నెగల అంత్యవలయమున తూర్పునుండి వరుసగా భూమిని, జలమును, అగ్నిని, వాయువును, ఆకాశమును, ఆవాహనము చేసి పూజించవలెను. మండలముయొక్క మధ్యప్రదేశమున సువర్ణ యంత్రముపై సువర్ణకలశమునుగాని లేక తామ్ర కలశమునుగాని పంచపల్లవములు, పంచరత్నములు, పంచధాన్యములు, పంచౌషధులు, పంచవర్ణాంబరము, గంధమాల్యాదులు, శుద్ధోదకము, కంకణము, దర్భలు, మారేడుపండు మొదలగువాని నాయాప్రదేశము లందు చక్కగానుంచి యందు వరుణుని వరుసగా పంచబ్రహ్మ

స్వరూపులగు పంచమహర్షులను, పంచదేవీస్వరూప పంచశక్తులను, నూటయిరువదియైదుగురు సమహర్షులను, నూటయైదుగురు స్త్రీ దేవతలను, పంచమహాభూతములను, ఆవాహనముచేసి మధ్య గాయత్రీ సహితముగ శ్రీమద్విరాడ్విశ్వకర్మను ఆవాహనముచేసి సువర్ణ ప్రతిమలను పంచామృతములతో నభిషేకమొనర్చి షోడశోప చారములతో పూజించి పాయసాన్నమును నివేదించవలయును.

ఆగ్నేయ వేదికయందు మాతృకామండలమును రచించి యందు మాతృకాదేవతలను లక్ష్మీసహితగణపతిని ప్రతిష్ఠించ వలెను. గోధుమలతోగాని రక్తతండులములతోగాని మాతృకా మండలమును రచించవలెను. అచట షోడశపాలికలనుంచి ఆవాహ నము మొదలగు షోడశోపచారములతో పూజించవలెను. దీనిని అంకురారోపణమందురు. తదుపరి గోడయందు ఉత్తరోత్తరక్రమ ముగా 5 ధారలుగాని 7 ధారలుగాని ఆజ్యమును విడువవలెను. ఘృతమాతృకలను పూజించి యచటనే యాభ్యుదయికనాంది దక్షి ణమునుండి యుత్తరమునకు వరుసగా 12 స్థానములయందు వేఱు వేఱుగా ఒక్కొక్కమాసమునకు నువ్వులుగాని గోధుమలుగానిపోసి 12 దీపములను వెలిగించవలెను, మధ్యవేదికయందు దక్షిణముననూ తన వస్త్రముపై బియ్యమునుబోసి యందు ఏకాశీతి పదవాస్తుమండ లమును రచించవలెను.

నిలువుగీతలు పదియును, అడ్డగీతలు పదియును, గీయగా 81 గదులేర్పడును. అందలి మధ్య 9 గదులు ఎఱుపు. దానికి నలు దిశలను ఒకగదివరుసను మూడుగదులపొడవున పసుపువన్నెకలవి 4 మొత్తము 12 గదులును ఈనాలుగుమూలలయందు ఒక్కొక్కగది చొప్పున ఆకుపచ్చవన్నెకలవి 4 గదులును, తూర్పుమొదలు 4దిశల మధ్యద్వారములవలె తెలుపుగదులు రెండేసి చొప్పున రెండు వరుసలుకలిగి యుండును. వెలుపలినుండి నాలుగు మూలలను

ఒక్కొక్కగది యెఱుపును, వానిలోపలనున్న మూలగదులు 4 తెలుపును. మూలనున్న యెఱుపుగది కిరువైపుల నొక్కొక్కగది ఆకుపచ్చయును, ఇట్లు 4 వైపులనుండునవికలసి 8 ఆకుపచ్చగదు లగును. ఆకుపచ్చగది వెంబడిగదియును దానిలోపలిగదియునుకలసి 2 గదులచొప్పున యెఱుపు. ఎఱుపుగదుల నానుకొని రెండేసిగదుల చొప్పున అదేవిధముగా నలుపు, నలుపుగదుల రెంటిమధ్యనున్న తెలుపుగదులే పై జెప్పినద్వారములు. దీని చుట్టూ సత్త్వరజస్తమో గుణములను మూడురేఖలు. తెలుపు యెఱుపు నలుపుతోగూడి మొత్తమొకగది పరిమితిలో నుండవలెను.

ఇందు మధ్యసృష్టికర్తయగు బ్రహ్మయును, పసుపువన్నె గదులలో నలుగురుదేవతలును, మూలనున్న ఆకుపచ్చగదులలో నలుగురుదేవతలును, ఆపైనున్న మూల తెలుపుగదులలో నలుగురు దేవతలును, ఈశాన్యాదిగా 4 దిశల 32 దేవతలునుకలసి మొత్తము 45 దేవతలుందురు. ఈ మండలము నానుకొనియున్న సత్త్వమండల మను శ్వేతపరిధిలో చుట్టూ లోకపాలకులు దిక్పాలురుకలసి 26 దేవతలుందురు. వాస్తుశాస్త్రమున దీనిని పరశాయిక మందురు. నైరృతి వేదికపై తండులములుగాని గోధుమలుగానిపోసి అందు 64 యోగినీగణమును, వాయవ్యవేదికపై యటులనే గోధుమలు గాని బియ్యముగానిపోసి యందు 52 భైరవగణమును, 49 మరుద్గణ మును స్థాపించవలయును.

తరువాత సుముహూర్తమున యజమానుడు పత్నీయుక్తముగ సర్వౌషధిజలములతోను, హరిద్రతోను, తైలముతోను, మలిన స్నానము చేసి పిదప శుద్ధిస్నానమును చేయవలయును. ముఖమార్జన మును పంచగవ్య ప్రాశనమునుచేసి 'అపవిత్రః పవిత్రోవా' అను మంత్రముచేత తన శిరస్సుపై నీళ్లు చిలుకరించుకొనవలెను. యజ్ఞ శాలలో ప్రవేశించి యాగ్నేయమున మాతృమండలమును, లక్ష్మీన్

సహితముగ గణపతిని, మాతృకాదేవతలను మరల పూజించి నాందీ శ్రాద్ధమును చేసి కలశమునకు రక్షామాలను ధరించవలయును. మొదట శిల్పాచార్య బ్రహ్మఋత్విజులకు వస్త్రయుగ్మము, తలపాగ, చెవిపోగులు, తావళము, ఉంగరము, సువర్ణకంకణము, ధనము, నొసగి శాస్త్రోక్తముగా పూజించి దీక్షాకంకణము లీయవలెను. అటుల పూజించనిచో పాపముతోగూడిన యాగమగును.

కర్త బ్రాహ్మణులతో బుధులారా! మీరంద ఱేకీభవించి యీ సవనమును యథావిధిగా నొనర్చి నన్ను ఫలయుక్తునిగా జేయుడని ప్రార్థించుచు వారికి కంకణములను గట్టవలయును. గరిక, గోధుమగడ్డి, చేతికడియము, మామిడియిగురు, పసుపుకొమ్ము, ప్రమానిపసుపు, ఆవాలు, నెమిలికన్ను, త్రాచుపాము కుబుసము, యీ 9 పట్టుగుడ్డలోనుంచి దిగ్బంధన మంత్రానంతరము యజమానునికి కుడిహస్తమునను, ఆయన భార్యకు ఎడమహస్తమునను, కంకణములను గట్టించవలయును. తదుపరి తిలకమును ధరించి పుణ్యాహవాచనముచేసి యీశాన్యమున గణపతియొద్ద అఖండమును వెలిగించి యచట ధాన్యరాశియందు కలశమునుంచి యందు మారేడుపండును, జలమునుంచి కొబ్బరికాయ, పుష్పములు, గంధము, అక్షతలు, చందనము, పంచపల్లవములు, దర్భలు. ఉంచి యెఱ్ఱని వస్త్రమును జుట్టి కంకణమును కట్టవలయును. అందు గణపతిని, గ్రహములను, దేవతలను, వరుణుని పూజించవలెను. అంతట పంచగవ్యములను ఆవాలను చల్లవలెను. మంగళవాద్యములతోను, వేదనాదములతోను, ఉత్తరపు వైపునుండి పశ్చిమద్వారమున మండపములో ప్రవేశించి సామాన్యముగా నవగ్రహ పూజనము గణపతి సహిత షోడశమాతృకాపూజనము చేయవలయును. 5 నిలువు గీతలను 5 అడ్డగీతలను గీచి 16 గదులుగా చేయవలెను. అందు మధ్యనున్న 4 గదులలో మొదట వాయవ్యమున గణపతిని, నైరృతిన గౌరిని,

ఆగ్నేయమున పద్మను, పడమర శచిని ఆగదికి దక్షిణమున మేధను, దక్షిణమున సావిత్రిని, ఆగదికి పడమర విజయను, ఉత్తరమున జయను, ఆగదికి పడమర దేవసేనను, వెలుపలి ఈశాన్యపుగదిలో స్వధను, ఆగ్నేయమున స్వాహాను, తూర్పున మాతృకలను, ఆగదికి దక్షిణమున లోకమాతృకలను, వాయవ్యమున ధృతి, పుష్టి అను నిరువురను, నైరృతిన తుష్టిని, మధ్యగదులలో నీశాన్యమున కుల దేవతలను, క్రమముగా స్థాపించి షోడశోపచారములతో పూజించ వలెను. పిమ్మట గోధుములుగాని రక్తతండులములుగానిపోసి యందు సప్తమాతృకలను ధృతమాతృకలను పూజించవలెను.

అంతట గోకయం దుత్తరోత్తర క్రమముగా 7 ధారలను విడువవలయును. ఆభ్యుదయికనాందీ శ్రాద్ధమునుచేసి యావస్తువు లను బ్రాహ్మణున కిచ్చివేయవలెను. ఆచార్యుడు స్వాహాస్త్రముతో గౌరసర్షపములను అంతటను చల్లవలెను. పంచగవ్యములను కుశోద కమును ప్రోక్షించవలెను. ప్రతిజ్ఞాసంకల్పము చెప్పి మహాధ్వజమును స్థాపించవలెను. గణపతిని పూజించి రక్షాతిలకమును ధరించి ఛాయా పాత్రధానమును చేయవలెను. తరువాత యజమానుడు మండపముయొక్క పశ్చిమద్వారమున తూర్పుముఖముగ గూర్చుండి గురువునకు గణపతికి విశ్వకర్మకు గాయత్రికి నమస్కరించి సంకల్ప మును చెప్పుకొని, మండపస్తంభములను, ద్వారములను, తోరణము లను, త్రిశూలములను, దిక్పాలకుల యాయుధములను, ధ్వజపతాక లను, వేదికలను నిర్మించవలెను. పిమ్మట మధ్యవేదియందు ఆగ్నేయ స్తంభము మొదలు నాలుగింటి యందును, అటులనే వెలుపలి వేది యందును ఆగ్నేయము మొదలు 12 స్తంభములయందును సమంత్ర కముగా త్రవ్వవలయును. జలమును ప్రోక్షించవలెను. పెరుగు, గోధుమలు, బంగారము, గరిక, ఉంచవలెను.

ఇట్లు స్తంభతోరణమును, స్తంభమున త్రాడును, మంత్ర

యుక్తముగ గట్టవలెను. ఇట్లు 16 స్తంభములను స్థాపించవలెను. పిదప మధ్యస్తంభములు 4. ఆగ్నేయము మొదలుగ విజయ, కేదార, శ్రీమంత, సుభద్ర, అను నామములతో స్థాపించవలెను. వెలుపలి వేదికయందు ఆగ్నేయము మొదలుగ ధనద, కల్యాణ, శుభ, శాంత, మనోరమ, బుద్ధి, సిద్ధి, విచిత్ర, మహాయశ, మంగళ, గుణ, జయ, అను నామములతో స్థాపించవలెను. తరువాత 'అగ్నిమీళే' అను మంత్రముతో బహుమంగళమను పూర్వద్వారమును, 'ఇషేత్వా' అను మంత్రముతో ధర్మిష్ఠ, యను దక్షిణద్వారమును, 'అగ్నఆయాహివీతయే' అను మంత్రముతో జయమను పశ్చిమద్వారమును, 'శంనోదేవి' అను మంత్రముతో కల్యాణమను ఉత్తరద్వారమును, నిర్మించవలెను.

ఈ మంత్రములతోనే నాలుగుదిక్కుల తోరణములను కట్టవలెను. తూర్పున భీమమను ప్లక్షతోరణమును, దాని శిరస్సున మంగళమను వైష్ణవ త్రిశూలమును, స్థాపించవలెను. దక్షిణమున వికటమను మేడిమండల తోరణమును, దాని శిరస్సున శత్రుఘ్నమను రౌద్రత్రిశూలమును స్థాపించవలెను. పడమను ప్రభమరను మఱ్ఱిమండల తోరణమును, దానిశిరస్సున పుత్రప్రదమను బ్రాహ్మత్రిశూలమును స్థాపించవలెను. ఉత్తరమున సుదృఢమను రావిమండల తోరణమును, దాని శిరస్సున ఉత్తమమను సౌమ్యత్రిశూలమును స్థాపించవలెను. తోరణములను కట్టినవెనుక అరుగులను కట్టవలెను. శివప్రదమను పేరుగల మధ్యవేదిని కట్టవలెను. ప్రాగ్ద్వార కుంభమున 'బ్రహ్మజజ్ఞాన' మను మంత్రముతో బ్రహ్మను ఆవాహనముచేసి పూజించవలెను.

దక్షిణద్వార కుంభమున 'ఇదం విష్ణు' అను మంత్రముతో విష్ణువు నావాహనముచేసి పూజించవలెను. పశ్చిమద్వార కుంభమున 'త్ర్యంబక' మను మంత్రముతో రుద్రు నావాహనముచేసి

పూజించవలెను. ఉత్తరద్వార కుంభమున 'మహాఇంద్ర, అను మంత్రముతో ఇంద్రు నావాహనముచేసి పూజించవలెను. పిమ్మట 'అధార, అను మంత్రముతో జలమును ఆవాహనముచేసి పూజించవలెను. తదుపరి యిష్టకలను స్థాపించవలెను. ఇష్టకాదేవతలను ఆవాహనము చేసి పూజించవలెను. తూర్పు మొదలు ప్రదక్షిణక్రమముగా శివ, గంగ, మహాపుణ్యా, విశాల, సరస్వతి, తుష్టి, పుష్టి బుద్ధి, అను అష్టదేవతలను ఆవాహనము చేసి యజమాను డాచార్యఋత్విజులతో గూడినవాడై దోసిలియందు అర్ఘ్యమునుంచుకొని శాంతిసూక్తమును జెప్పికొనుచు పడమటి వాకిలియందునిలిచి నాలుగుచేతులును, తెలుపువన్నె యుగలిగి తాజేటిపుచ్చెయందుండి పద్మము, శంఖము, చక్రము, శూలము, దాల్చి సంతోషముతోనున్న భూదేవతను ధ్యానించి యర్ఘ్యమునువిడిచి కలశమును బట్టికొని గీత వాద్యాదులతో 'భద్రంకర్ణేభి, అను మంత్రమును పఠించుచు మండపమునకు ప్రదక్షిణముచేసి మరల పశ్చిమద్వారమార్గమున మండపములో బ్రవేశించవలయును.

దిగ్బంధనము తూర్పు మొదలుగ నెనిమిదిదిక్కులకు గోవింద, గరుడధ్వజ, వారాహ, నారసింహ, కేశవ, మధుసూదన, శ్రీధర, గదాధర, అను మంత్రములతోను, ఊర్ధ్వమున 'గోవర్ధన, అను మంత్రముతోను, అధోదిశను 'త్రివిక్రమ, అను మంత్రముతోను, దిగ్బంధనము చేయవలెను. అంతట పంచగవ్యములను చల్లవలెను. మొదట గాయత్రీమంత్రముతో గోమూత్రమును, 'గంధద్వారా, మను మంత్రముతో గోమయమును, 'ఆప్యాయస్వ, అను మంత్రముతో పాలును, 'దధిక్రాణ్ణ, అను మంత్రముతో పెరుగును, 'శుక్రమసి, అను మంత్రముతో నేయిని, 'దేవస్యత్వా, అను మంత్రముతో శుద్ధోదకమును, ప్రోక్షించవలెను.

తరువాత దోసిట పుష్పఫలాదులనుంచికొని సమస్తదేవతలకు

నమస్కరించి 16 స్తంభములను షోడశోపచారములతో పూజించవలెను. యజమానుడు తూర్పుముఖముగ గూర్చుండి ఆచమనము చేసి సంకల్పముచెప్పి మండప స్తంభ దేవతలను, ద్వారతోరణ త్రిశూల పతాకాధ్వజసహిత దిక్పతులను పూజించవలెను. మధ్య వేదికయందు ఈశాన్యస్తంభ మూలమున 'బ్రహ్మజజ్ఞాన' మను మంత్రముతో బ్రహ్మను, 'ఊర్ధ్వఊషుణ' అను మంత్రముచేత స్తంభ తోరణమును, స్తంభాగ్రమును, 'అయంగౌః' అను మంత్రముచేత శాఖాబంధమును, పూజించవలెను.

(అనగా కొబ్బరిమట్టలు చివరలుకలిపి కట్టినప్రదేశము) ఆగ్నేయస్తంభమూలమున 'ఇదంవిష్ణు' అను మంత్రముతో విష్ణువును, 'ఊర్ధ్వఊషుణ' అను మంత్రముతో స్తంభతోరణమును స్తంభాగ్రమును, 'అయంగౌః' అను మంత్రముచేత శాఖాబంధమును, పూజించవలెను. నైరృతిస్తంభ మూలమున 'పరితోరుద్రస్య' అను మంత్రముతో శివుని 'ఊర్ధ్వఊషుణ' అను మంత్రముతో స్తంభ తోరణమును స్తంభాగ్రమును 'అయంగౌః' అను మంత్రముతో శాఖాబంధమును పూజించవలెను. వాయవ్యస్తంభమూలమున 'మహాఃఇంద్ర' అను మంత్రముతో ఇంద్రుని 'ఊర్ధ్వఊషుణ' అను మంత్రముతో స్తంభతోరణమును స్తంభాగ్రమును, 'అయంగౌః' అను మంత్రముతో శాఖాబంధమును పూజించవలెను. నమస్కారము చేసి ప్రార్థించి వెలుపలి 12 స్తంభములను ఈశాన్యమునుండి ప్రదక్షిణ క్రమముగా పూజించవలెను.

ఈశాన్యమున 'చిత్రందేవానా' మను మంత్రముచే సూర్యుని దానికి దక్షిణమున 'గణానాంత్వా' అను మంత్రముచేత గణపతిని, దానికి దక్షిణమున 'యస్మిన్వృక్ష' అను మంత్రముచేత యముని, ఆగ్నేయమున 'కాలికోనామసర్పః' అను మంత్రముచేత నాగరాజును, దానికి పడమర 'బలిస్థాపర్వతానా' మను మంత్రముచేత షణ్ముఖుని,

దానికి పడమర 'వాయవాయాహి', అను మంత్రముచేత వాయువును, నైర్ఋతిన 'అప్యాయస్వ', అను మంత్రముచేత సోముని, దానికి ఉత్తరమున 'తత్వాయామి', అను మంత్రముచేత వరుణుని, దానికి ఉత్తరమున 'సుగావోదేవాః', అనుమంత్రముచేత అష్టవసువులను, వాయవ్యమున, 'సోమోధేనుః', అను మంత్రముచేత ధనదుని, దానికి తూర్పున 'ఇంద్రఆసాయేన', అను మంత్రముచేత బృహస్పతిని, దానికి తూర్పున 'విశ్వకర్మన్‌హావిషా', అను మంత్రముచేత విశ్వకర్మను, పూజించవలయును.

యజమానుడు పుష్పములను దోసిటనుంచి 'అఘోరేభ్య', అను మంత్రముతో మండపము నంతటను చల్లవలెను. 'ఓం నాగమాత్రేనమః', అని నలువైపుల పైనున్న చూరుకమ్మలను పూజించవలెను. 'ఓం నమః సర్వేభ్యః', అని శాఖాబంధములను (అనగా కొబ్బరిమట్టల చివరలుకలిపి కట్టిన ప్రదేశమును, పూజించవలెను. తరువాత పశ్చిమద్వారమునుండి వెలుపలికిపోయి తూర్పుద్వారమునుండి వరుసగా నాల్గు ద్వారములను పూజించవలెను. మండపముయొక్క తూర్పువాకిలియందు తోరణమునకు భయపార్శ్వములందు రెండుకలశముల నుంచవలయును. 'కయానశ్చిత్ర', అను మంత్రముచేత దక్షిణకలశమున రాహువును, 'బృహస్పతే అతియదర్య', అను మంత్రముచేత ఉత్తరకలశమున బృహస్పతిని, ఆవాహనముచేసి 'ధ్రువాద్యౌ', అను మంతముచేత రెండుకలశములయందు ధ్రువుని ఆవాహనము చేయవలయును.

తరువాత తూర్పుద్వారమున తెల్లని వస్త్రములతోను తెల్లని పుష్పములతోను కూడిన సుదృఢనామప్లక్ష తోరణమును నిషధాచలమును కృతయుగమును ఋగ్వేదమును ఆవాహనము చేయవలయును. ద్వారదక్షిణ శాఖయందు ధాతను, ఉత్తర శాఖయందు విధాతను, ఉత్తరాసియందు గణేశుని, గడపయందు ద్వారశ్రీని,

దేహళీమధ్య ప్రదేశమున వాస్తుపురుషుని ఆవాహనముచేసి పూజించవలయును. అచటనే 'త్రాతార, మను మంత్రముచేత ఇంద్రుని ఆవాహనముచేసి పూజించవలయును. మంగళమను త్రిశూలమును 'ఇదం విష్ణు, అను మంత్రముతో ఆవాహనముచేసి పూజించవలెను. ప్రదక్షిణక్రమముగా త్రిశూలముయొక్క ప్రథమశృంగమున ఇంద్రుని ద్వితీయశృంగమున ధాతను, తృతీయశృంగమున భగుని పూజించవలెను. దక్షిణద్వారమున పూర్వమువలెనే రెండుకలశములను స్థాపించి 'స్యోనాపృథివీ,అను మంత్రముచేత భూమ్యావాహనముచేసి పూజించవలెను. 'ఆకృష్ణేన, అను మంత్రముతో కుడివైపు కలశమున సూర్యుని 'అగ్నిర్మూర్ధాదివ, అను మంత్రముతో ఎడమవైపు కలశమున కుజుని, ఆవాహనముచేసి పూజించవలెను. వికటమను ఉదుంబరతోరణమును నీలవస్త్రము నీలపుష్పములతో గూడిన దానిని వింధ్యాద్రిని, త్రేతాయుగమును, యజుర్వేదమును, ఆవాహనముచేసి పూజించవలెను.

'యమాయత్వా, అను మంత్రముచేత యముని ఆవాహనముచేసి పూజించవలెను. ద్వారదక్షిణ శాఖయందు చండుని, ఉత్తర శాఖయందు ప్రచండుని, (అనగా కుడియెడమలు) ఉత్తరాసియందు గణేశుని, గడపయందు ద్వారశ్రీని, మధ్యప్రదేశమున వాస్తుపురుషుని ఆవాహనముచేసి పూజించవలెను. శత్రుఘ్నమను త్రిశూలమును 'మానస్తోక, అను మంత్రముచేత రుద్రుని ఆవాహనముచేసి పూజించవలెను. శృంగములయందు ప్రదక్షిణక్రమముగా పూష, మిత్ర, వరుణులను పూజించవలెను. పశ్చిమద్వారమున రెండు కలశములను స్థాపించి 'అన్నాత్వారిస్రుత,అను మంత్రముచేత కుడివైపు కలశమున శుక్రుని, 'ఉద్ధృత్యస్వ, అను మంత్రముచేత ఎడమవైపు కలశమున బుధుని, ఆవాహనముచేసి పూజించవలెను. భీమాఖ్యవట తోరణమును, రక్తవస్త్రము రక్తపుష్పములతోను, హేమకూట

మును, ద్వాపరయుగమును, సామవేదమును, ఆవాహనముచేసి పూజించవలెను. ద్వారదక్షిణశాఖయందు జయుని, ఉత్తరశాఖయందు విజయుని, ఉత్తరాశియందు గణపతిని, గడపయందు ద్వారశ్రీని, మధ్యప్రదేశమున వాస్తుపురుషుని, ఆవాహనముచేసి పూజించవలయును.

పుత్రప్రదమను త్రిశూలమును 'బ్రహ్మజజ్ఞాన' మను మంత్రము చేత బ్రహ్మను ఆవాహనముచేసి పూజించవలెను. త్రిశూలశృంగములయందు ప్రదక్షిణ క్రమముగా అర్యమ్ణ, అంశు, శివస్వాంతులను పూజించవలెను. ఉత్తరద్వారమున రెండు కలశములనుంచి 'ఇదంమేవా' అను మంత్రముచేత కుడివైపు కలశమున సోముని, 'శంనోదేవి' అను మంత్రముచేత ఎడమవైపు కలశమున శనిని, ఆవాహనముచేసి పూజించవలెను. సుప్రభమను అశ్వత్థతోరణమును పీత వస్త్రము పీత పుష్పములతోను, హిమాచలమును కలియుగమును, అథర్వణవేదమును, పూజించవలెను. ద్వారదక్షిణ శాఖయందు భద్రుని, ఉత్తరశాఖయందు సుభద్రుని, ఉత్తరాసియందు గణపతిని, గడపయందు ద్వారశ్రీని, మధ్యప్రదేశమున వాస్తుపురుషుని ఆవాహనముచేసి పూజించవలెను. ఉత్తమమను త్రిశూలమును 'సోమోధేనుం' అను మంత్రముచేత సోముని ఆవాహనముచేసి పూజించవలెను. త్రిశూలశృంగములయందు ప్రదక్షిణక్రమముగా సోముని ముమ్మారు ఆవాహనము చేయవలెను.

తరువాత దిక్పాల ద్వార పూజనములు చేయవలయును. తూర్పున ఐరావతమును, ధ్రువ, అధ్వర, అను వసువులను ద్వార శాఖలయందును శృంగములయందును (ఉత్తరాసిచిమ్ములు) వస్త్రములనుజుట్టి శాఖామూలములయందు ధాన్యరాశిపై జలపూరితములగు ప్రశాంత, శిశిర, నామములుగల కలశములనుంచి నవధాన్య బీజయుతమగు మూకుళ్ళతోమూసి 'అజిఘ్న' అను మంత్రముచేత

ప్రతిష్ఠించి గంధాదులతో పూజించవలయును. ద్వారదేశమున ఇంద్రుని ఆవాహనముచేసి పూజించి పసుపువన్నె పతాకగల ధ్వజమును అందుకొని 'త్రాతారమింద్ర' మను మంత్రముచేత తోరణముపై నుంచవలెను. బహుమంగళమను పేరుగల పూర్వద్వారపు ఉత్తరాసియందు గణపతిని, శాఖలయందు గంగాయమునలను, భూలోక భువర్లోకములను, ఆదిత్యసోములను, ధాతవిధాతలను, గడపయందు ద్వారశ్రీని, మధ్యవాస్తుపురుషుని ధ్వజమూలమున కుముదుని, ధ్వజపతాకయందు హేతుకుడను క్షేత్రపాలుని, అందే బ్రహ్మను రుద్రుని, దేవతలను, సిద్ధులను, విద్యాధరులను, పన్నగులను ద్వారశాఖలయందు నందిని, మహాకాలుని, పూజించి ద్వారస్థ కలశమునందు 'ఇంద్రాదాయసామగాయన' అను మంత్రముచేత ఇంద్రుని ఆవాహనముచేసి నేతియన్నమును బలిని పెట్టవలయును. 'అగ్నిమీళే' అను మంత్రముచేత ఋగ్వేదమును ఆవాహనముచేసి పూజించవలెను. ఋగ్వేదప్రతినిధిగ ఋగ్వేదీయ బ్రాహ్మణుని గంధాదులతో పూజించవలెను.

అచట ద్వారపాలకులుగ నిద్దరు బ్రాహ్మణులు, ఒకరు శ్రీసూక్తమును, ఒకరు పావమానమును జపించవలెను. ఆగ్నేయ కోణమున కలశమునుంచి పుండరీకమును పూజించి అగ్నిహోత్రుని ఆవాహనముచేసి పూజించి 'అగ్నఆయాహి' అను మంత్రముచేత రక్తపతాకధ్వజమును అందికొని 'త్వన్నో అగ్నే' అను మంత్రముచేత నెత్తి 'ధామంతే' అను మంత్రముచేత పూజించి ధ్వజమూలమున కుముదుని, పతాకయందు త్రిపురఘ్నుడను క్షేత్రపాలుని, పూజించవలెను. 'అగ్నిందూత' మను మంత్రముచేత నేతియన్నమును బలిని పెట్టవలయును. దక్షిణమున శ్రీభూమ్యధిష్ఠితమైన ధర్మిష్ఠ మను ద్వారముయొక్క శాఖలయందు వస్త్రములనుగట్టి సోమ, ధర్మ, అను వసువులను పూజించవలెను. శాఖామూలములయందు ధాన్య

ముపై పర్జన్య, అశోక, అను కలశములనుంచి మునుపటివలె నవ ధాన్య బీజయుక్తమగు మూకుళ్ళతో మూసి 'అజిఘ్న,అను మంత్రము చేత ప్రతిష్ఠించి పూజించవలెను. అందే వామనమును, గోదావరి, కృష్ణ, రుద్ర, అను వారలను, ద్వారశాఖలయందు మహర్లోకమును, కుజుని, బుధునిపైన యజుర్వేదమును, శాఖలయందు చండప్రచండు లను, అందే ధాతవిధాతలను, ఉత్తరాసియందు గణపతిని, గడప యందు వామనమును ద్వారశ్రీని, మధ్యవాస్తు పురుషుని, అచటనే గాయత్రిని, లక్ష్మిని, సరస్వతిని, శాఖలయందు గణేశ వృషభులను, పూజించవలెను.

'యమాయత్వామఖాయ, అను మంత్రముచేత యముని ఆవాహనముచేసి నల్లని జెండాకఱ్ఱను పట్టుకొని 'యమాయత్వాంగిర, అను మంత్రముచేత తోరణముపైనుంచి పూజించి 'సుగన్నః పంథా, అను మంత్రముచేత మినుపకుడుములను బలినిపెట్టవలయును. ధ్వజ మూలమున కుముదుని ధ్వజపతాకయందు క్షేత్రపాలుని పూజించ వలెను. ఇషత్వా అను మంత్రముచేత యజుర్వేదమును పూజించి యజుర్వేదప్రతినిధిగ యజుర్వేదీయ బ్రాహ్మణుని గంధాదులతో పూజించవలెను. అచట ద్వారపాలకులుగ నిద్దరు బ్రాహ్మణులు ఒకరు సోమసూక్తమును, మరియొకరు మంగళసూక్తమును జపించ వలెను. నైరృతిన కలశమును స్థాపించి కుముదుని, 'అసున్వంత, మను మంత్రముచేత నిర్మృతిని ఆవాహనముచేసి 'యంతేదేవీ నిర్మృతి, అను మంత్రముచేత నల్లని జెండాకఱ్ఱను పట్టికొని 'ఏషతేనిర్మృతే భాగ, అను మంత్రముచేత జెండాను ఎత్తవలెను. 'మోషూణఇంద్ర, అను మంత్రముచేత యెఱ్ఱబియ్యపు అన్నమును నేతితో బలినిపెట్ట వలెను. ధ్వజముగలమున వామనుని పతాకయందు అగ్నిజిహ్వుడను క్షేత్రపాలుని పూజించవలెను. పశ్చిమమున జయమను ద్వారమున ద్వారశాఖలయందు అనిలుడు, అనలుడు అను వసువులను, శృంగ

ములయందు శాఖలయందు వస్త్రములనుగట్టి శాఖామూలములయందు ధాన్యరాశిపై భూతసంజీవన అమృతమను పేరుగల రెండుకలశములను మునుపటివలెనే ప్రతిష్ఠించి పైననవధాన్య బీజయుక్తముగు మూకుళ్ల తోమూసి అంజనమును పూజించి కలశములందు రేవా, తాపీ, అను నదులను, అందు విష్ణువును ఆవాహనముచేసి ద్వారశాఖలయందు ధాతవిధాత కిరీటిసకంద అను వారలను ద్వారమున జనర్లోక తపో లోకములను, బృహస్పతి శుక్రులను, పైన ఉత్తరాసియందు సామ వేదమును ద్వారశాఖలయందు నర్మద, గోదావరి, అను దేవతలను ఉత్తరాసియందు గణపతిని, గడపయందు ద్వారశ్రీని, మధ్య వాస్తుపురుషుని, పూజించి 'తత్వాయామి, అను మంత్రముతో వరుణుని ఆవాహనముచేసి పూజించి నల్లని జెండా కఱ్ఱను పట్టికొని 'ఉదుత్తమం వరుణ, అను మంత్రముచేత తోరణముపై నుంచి త్వనోన్నఅగ్నే, అను మంత్రముచేత వెన్నతోగూడిన యన్నమును బలిని పెట్టవలయును.

'యోమేదండ, అను మంత్రముతో తెల్లజెండాకఱ్ఱను పట్టికొని ధ్వజమూలమున శంకుకర్ణుని, జెండాయందు కాలుడను క్షేత్రపాలుని పూజించవలెను. సామవేదమును పూజించి తత్ప్రతినిధిగ సామవేదీయ బ్రాహ్మణుని గంధాదులతో పూజించవలెను. అచట నిద్దరు బ్రాహ్మణులు ద్వారపాలకులుగ నుండి ఒకరు పురుషసూక్తమును, మరియొకరు శ్రీసూక్తమును పఠించవలెను. ఇతను ఒకరు 'ఇంద్రాయ సామగాయత, అను మంత్రమును, రెండవవారు 'అహమస్మిన్, అను మంత్రమును, మొదటివారు 'ప్రథమజా, అను మంత్రమును, రెండవ వారు 'సేతుస్తర, అను మంత్రమును, మొదటివారు 'స్వాధిష్ఠయా, అను మంత్రమును, రెండవవారు 'గాయంతిత్వా, అను మంత్రమును మొదటివారు 'జ్యేష్ఠమాస, అను మంత్రమును, రెండవవారు 'అగ్నే ఇమే, అను మంత్రమును క్రమముగా పఠించవలెను. వాయవ్యమున

కలశమునుంచి పుష్పదంతమును పూజించి వాయువు నావాహనము చేసి 'వాయోయేన, అను మంత్రముచేత ధూమ్రవర్ణ పతాకాధ్వజ మును పట్టికొని 'తవవాయు, అను మంత్రముచేత ధ్వజమును పైన కట్టవలెను. అచట సర్వనేత్రుడను క్షేత్రపాలుని పూజించవలెను. గోధుమ అన్నమును బలినిపెట్టవలెను.

ఉత్తరమున కల్యాణమను ద్వారమున ప్రద్యుమ్నుని ద్వార శాఖలయందు ప్రత్యూష, ప్రభాస, అను వసువుల నిద్దరిని, ద్వార శాఖలయందును ఉత్తరాసి చిమ్ములయందును వస్త్రములను గట్ట వలెను. ద్వారశాఖల మూలములయందు ధాన్యరాశిపై ధనద శ్రీప్రదమను కలశముల రెంటిని మునుపటివలెనే నవధాన్య బీజము లతోగూడిన మూకుళ్ళతో మూసి యందు సార్వభౌమమును పూజించి కలశమునందు వేణిని, శాఖలయందు జయ విజయ ధాత విధాత సత్యలోక ధ్రువలోకములను, శనైశ్చర రాహువులను పైన ఉత్తరాసి యందు అథర్వణ వేదమును, ద్వారశాఖలయందు వేణి, పయోష్ణి అను వారలను, ఉత్తరాసియందు గణపతిని, గడపయందు ద్వారశ్రీని, మధ్య వాస్తుపురుషుని, పార్వతీశుని, చండేశ్వరుని ఆవా హనముచేసి పూజించవలెను. 'సోమోధేను, అను మంత్రముచేత పసుపువన్నె జెండాను 'యోమేదండ, అను మంత్రముచేత ధ్వజ దండమును పట్టికొని 'వయగ్ంసోమ, అను మంత్రముతో పైనగట్టి పూజించవలెను.

ధ్వజమూలమున సుముఖుని, పైన ఏకపాదుడను క్షేత్రపాలుని పూజించి కొజ్జలు బలి యివ్వవలయును. 'శంనోదేవి,అను మంత్రము చేతఅథర్వణవేదమును పూజించి తత్ప్రతినిధిగ అథర్వణవేదీయ బ్రాహ్మణుని గంధాదులతో పూజించవలెను. తదుపరి బ్రాహ్మణు లిద్దరు ద్వారపాలకులుగనుండి వామదేవ సూక్తమును పఠించ వలెను. అథర్వాంగిరసం, అథర్వశీర్షం, దేవీ, మధుసూక్తి, సోధసం

శాంతిసూక్తములను పఠించవలెను. ఈశాన్యమున సుప్రతీకమను కలశమును స్థాపించి అందు శివుని ఆవాహనముచేసి పూజించి 'నమః శంభవాయచ, అను మంత్రముచేత ఎఱ్ఱజెండాకఱ్ఱను పట్టికొని 'తమీశాన, మను మంత్రముచేత తోరణముపై కట్టవలెను. పతాకయందు పుష్టిని, ధ్వజమూలమున సుముఖుని సుప్రతిష్ఠితుని, క్షముడను క్షేత్రపాలుని పూజించి గోధుమ అన్నముగాని అడవిగోధుమ అన్నముగాని బలిని పెట్టవలెను. నిర్కృతి పశ్చిమములమధ్య అనంతుని ఆవాహనముచేసి పూజించి 'నమోస్తుసర్పేభ్య, అను మంత్రముతో మేఘవర్ణ పతాకను పైన గట్టవలెను. భైరవుడను క్షేత్రపాలుని పూజించవలెను.

'విష్ణోర్ణుక, మను మంత్రముచేత పాయసమును బలిని పెట్టవలెను. ఈశాన్యప్రాగ్దిశలమధ్య బ్రహ్మను ఆవాహనముచేసి పూజించవలెను. 'యద్దేవ, అను మంత్రముచేత రక్తధ్వజ పతాకను తీసికొని 'బ్రహ్మజజ్ఞాన, మను మంత్రముచేత పైన కట్టవలెను. ధ్వజమూలమున సుప్రభుని, పతాకయందు భూతనాథుడను క్షేత్రపాలుని పూజించవలెను. 'సనోభువనస్య, అను మంత్రముచేత పాయసముతో గూడిన యన్నమును బలిని పెట్టవలెను. పిదప యజ్ఞశాలమధ్య 'బ్రహ్మజజ్ఞాన, మను మంత్రముచేత మహాధ్వజమును పూజించి ధ్వజదండమునందు కిన్నరులను పూజించి 'ఇంద్రస్యవృష్ణో, అను మంత్రముచేత కట్టవలెను. తరువాత తూర్పున 'గణానాంత్వా, అను మంత్రముచేత గణపతిని పూజించవలెను. 'నమోస్తుసర్పేభ్యో, అను 'అస్మేరుద్రా, అను మంత్రములచేత మండపము వెలుపల అన్ని దిశలయందు ఏకాదశ రుద్రులను స్థాపించి వారికి బలిని పెట్టవలయును. ఈశాన ఉత్తరములమధ్య భీముని మహాదంష్ట్రుడను క్షేత్రపాలుని పూజించి పాయసాన్నమును బలిని పెట్టవలయును. ఆదిత్యులు, వసువులు, మరుద్గణము, అశ్వినులు, కిన్నరులు, రుద్రులు,

సుపర్ణులు, పన్నగులు, గ్రహములు, అసురులు, యాతుధానులు, పిశాచములు, మాతృకలు, నగములు, శాకినులు, యక్షులు, వేతాళ గణము, యోగినులు, పూతనలు, శివలు, జృంభకులు, సిద్ధులు, గంధర్వులు, మాలలు, విద్యాధరులు, నదులు, దిక్పాలురు, లోక పాలకులు మొదలగువారలకు ఈశాన్యభాగమున బలిని పెట్టవలెను. తదుపరి మండపమునకు తూర్పున కొంచెము నేలను అలికి అచ్చట కూర్చుండి యీ మూడులోకములయందుగల స్థావరములు, జంగమ ములు మొదలగు యావద్భూతములును, బ్రహ్మవిష్ణు, శివాదులును, క్షేత్రపాలగణమును, దేవతలు, దానవులు, యక్షులు, రాక్షసులు, పన్నగులు, ఋషులు, మునులు, గోవులు, దేవమాతృకలు, మొద లగు అందఱు సంతోషముకలవారై మాయజ్ఞమును కాపాడుదురు గాక. అని ప్రార్థించి యీదేవతలనందరిని ప్రత్యేకముగ గంధాదు లతో పూజించి యచట అందరికిని బలిని పెట్టవలయును.

అంతట కాళ్లుచేతులు కడిగికొని యజమానుడు ఋత్విజులతో గూడి తూర్పుద్వారమున యజ్ఞమండపములో ప్రవేశించి వాస్తు దేవుని సమీపమునకువచ్చి కూర్చుండి పూజాపరిపూర్తికొఱకు ప్రార్థించవలెను. భూతోచ్చాటనమును దేవతాహ్వానమును చెప్పుచు వాస్తుమండలముయొక్క నాలుగుమూలలను యీశాన్యమునుండి ప్రదక్షిణక్రమముగా నాలుగు యినుపమేకులనునాటి యథాక్రమ ముగా ఈశాన్యమున రుద్రులకును సర్పములకును మినుపకుడుము లను పెరుగు అన్నమును బలిని పెట్టవలెను. ఆగ్నేయమున అగ్ను లకును సర్పములకును పరిశుద్ధాన్నమును బలిని పెట్టవలెను. నైరృతిన నిరృతికిని రాక్షసులకును ఎఱ్ఱని బియ్యపు అన్నమును బలిని పెట్ట వలెను. వాయవ్యమున వాయువునకును రాక్షసులకును పరిశుద్ధాన్న మును బలిని పెట్టవలెను. పిమ్మట కుంకుమ మొదలైనవానితోగాని బంగారు వెండి మొదలయిన సళాకులతోగాని దక్షిణమునుండి ఉత్త

రమునకు 9 సమానగదులు వచ్చునట్లు పడమరనుండి తూర్పు చివర యగునట్లు 10 గీతలను గీయవలెను. శాంత, యశోవతి, కాంత, విశాల, ప్రాణవాహిని, సతి, సుమనస, నంద, సుభద్ర, సురథ, అను పేరులుగల దేవతలు పడమర పాదము తూర్పు శిరస్సుగా భావించి పూజించవలెను.

వీనికి వంశములని వాస్తుశాస్త్రమునపేరు. అటులే పడమర నుండి తూర్పునకు 9 భాగములుచేసి 10 గీతలనుగీయునవలెను. అవియు దక్షిణమున ఆరంభించి ఉత్తరము చివరయగునట్లు గీయవలెను. వీనిని ఉపవంశములందురు. హిరణ్యా, సువ్రత, లక్ష్మి, విభూతి, విమల, ప్రియ, జయ, జ్వాల, విశోక, విశద, అను పేరులుగల దేవతలు ఒక్కొక్కగది కనీసము 2 అంగుళము లుండవలెను. ఈ రేఖా దేవతలను చందనాదులతో పూజించవలెను. దీనిని ఏకాశీతిపద మనియును, పరశాయిక మనియును చెప్పుదురు. వాస్తుమండలమున కుత్తరదిశయందు అలికిన నేలనుగాని కుండమునుగాని భూ సంస్కారము లైదుచేసి అగ్నిని ప్రతిష్ఠించి పూజించవలెను.

దర్భలతోచిమ్మి యాదర్భలను ఈశాన్యమున పారవేసి ఆవుపేడతో అలికి స్రువముచేత ఉత్తరోత్తర క్రమముగావ్రాసి ఆపటునగా అనామిక వ్రేలు బొటనవ్రేలు యీ రెంటితో మన్నును తీసి నీళ్ళతోతడిపి సుముహూర్తమున 'అగ్నిర్మూర్ధా, అను మంత్రము పఠించి 'భూర్భువస్సువరోం, అని అగ్నిని ప్రతిష్ఠించి షోడశోపచారములతో పూజించవలెను. పరిమళ ద్రవ్యములతో 49 నామములనుచెప్పి పూజించి యటులనే సర్వాంగ పూజనముచేసి ద్యౌః శాంతి, అని శిరస్సుపై జలమును చల్లవలెను. యజమానుడు అగ్ని కుండమును తాకవలెను. పురుషసూక్తమును పఠించి యీశాన్యమున గణపతిని ఆవాహనముచేసి యచటి కలశమున వరుణుని ఆవాహనముచేసి షోడశోపచారములతో పూజించవలెను. 'భూరసి

భూమి, అను మంత్రముచేత భూమినితాకి 'ధాన్యమసీతి,అను మంత్ర ముచేత ధాన్యమునుంచి 'వసోఃపవిత్రేణ, అను మంత్రముతో కంఠ మున నూతన వస్త్రమును చుట్టి పుష్పమాలను ధరించి 'యాఃఫలీ, అను మంత్రముతో పూగీఫలమునుంచి యా కలశమునందు సువ ర్ణము, వజ్రము, నీలము, పద్మరాగము, ముత్యము, అను పంచరత్న ములను 'హిరణ్యగర్భ, అను మంత్రముతో సువర్ణదక్షిణను సమ ర్పించి 'గంధద్వారా, మను మంత్రముచేత గంధమునుచల్లి 'యాఓషధీః, అను మంత్రముచేత సమస్తమైన యోషధులనుంచి "నచావహ్నిఃసహదేవీ "విష్ణుక్రాంతాచవారుణీ సంజీవనీజ్యోతిష్మతీ ఈశ్వరీ పూర్వతః క్రమాత్, అని అపరాజితపృచ్ఛయందు చెప్ప బడియున్నది.

'స్యోనాః పృథివీ, అను మంత్రముచేత అశ్వ, గజ, వల్మీక, నదీ, నదీసంగమ, పుణ్యక్షేత్ర, దేవాలయద్వార, గోష్ఠ, స్థానముల యందలి మృత్తికనుంచి 'కాండాత్కాండా, అను మంత్రముచేత గరికను జువ్వి మేడి మఱ్ఱి రావి మామిడి మండలును, 'పవిత్రేస్థో, అను మంత్రముచేత దర్భలను, 'పూర్ణాదర్వి, అను మంత్రముతో పూర్ణపాత్రను'శ్రీశ్చతే,అను మంత్రముతో శ్రీ ఫలమును అందుంచ వలెను. 'మనోజూతి, అను మంత్రముతో ప్రాణప్రతిష్ఠనుచేసి షోడ శోపచారములతో వరుణుని పూజించి యాకలశమునందు గంగను, బ్రహ్మ విష్ణు రుద్రులను, మాతృకలను, సమస్త తీర్థములను ఆదిత్యు లను, వసువులను, రుద్రులను విశ్వేదేవతలను, పితృదేవతలను, పంచ వింశత్యుత్తర శతబ్రహ్మర్షులను తత్పత్నులను గాయత్రీ విశ్వకర్మలను ఆవాహనముచేసి పూజించవలెను.

పిమ్మట మధ్యవేదికయందుత్తరభాగమున పైన చెప్పబడిన 27+27 రేఖలతో నలుచదరముగాను ఐదువన్నెలతోను లిఖించబడిన సర్వతోభద్ర మండలమున మధ్యవర్తులాకార మండలమున రక్త

పుష్పాక్షతలతో సూర్యుని, ఆగ్నేయమున అర్ధచంద్రాకార మండలమున శ్వేతపుష్పాక్షతలతో చంద్రుని, దక్షిణమున త్రికోణమండలమున రక్తపుష్పాక్షతలతో కుజుని, ఈశాన్యమున ధనురాకార మండలమున పీతపుష్పాక్షతలతో బుధుని, ఉత్తరమున పద్మాకార మండలమున పీతపుష్పాక్షతలతో గురుని, తూర్పున చతుష్కోణ మండలమున శ్వేతపుష్పాక్షతలతో శుక్రుని, పడమర దండాకార మండలమున కృష్ణపుష్పాక్షతలతో శనిని, నైరృతిన మకరాకార మండలమున ధూమ్రపుష్పాక్షతలతో రాహువును, వాయవ్యమున ఖడ్గాకార మండలమున ధూమ్రపుష్పాక్షతలతో కేతువును, ఆవాహనముచేసి వరుసగా అధిదేవతలు సూర్యుని కుడిప్రక్క శ్వేతపుష్పాక్షతలతో రుద్రుని, చంద్రుని కుడిప్రక్క రక్తపుష్పాక్షతలతో ఉమను, కుజుని కుడిప్రక్క పీతపుష్పాక్షతలతో షణ్ముఖుని, బుధుని కుడిప్రక్క పీత పుష్పాక్షతలతో విష్ణువును, గురుని కుడిప్రక్క శ్వేతపుష్పాక్షతలతో బ్రహ్మను, శుక్రుని కుడిప్రక్క పీతపుష్పాక్షతలతో ఇంద్రుని శని కుడిప్రక్క కృష్ణ పుష్పాక్షతలతో యముని, రాహువు కుడిప్రక్క ధూమ్రపుష్పాక్షతలతో కాలుని, కేతువు కుడిప్రక్క రక్తపుష్పాక్షతలతో చిత్రగుప్తుని, ఆవాహనముచేసి.

ప్రత్యధిదేవతలు సూర్యున కెడమప్రక్క రక్తపుష్పాక్షతలతో అగ్నిని, చంద్రున కెడమప్రక్క శ్వేతపుష్పాక్షతలతో జలమును, కుజున కెడమప్రక్క రక్తపుష్పాక్షతలతో భూమిని, బుధున కెడమప్రక్క పీతపుష్పాక్షతలతో విష్ణువును, గురున కెడమప్రక్క పీతపుష్పాక్షతలతో ఇంద్రుని, శుక్రున కెడమప్రక్క పీతపుష్పాక్షతలతో ఇంద్రాణిని, శని కెడమప్రక్క శ్వేతపుష్పాక్షతలతో ప్రజాపతిని, రాహువున కెడమప్రక్క కృష్ణపుష్పాక్షతలతో నాగుని, కేతువున కెడమప్రక్క శ్వేతపుష్పాక్షతలతో బ్రహ్మను ఆవాహనముచేసి—

నైరృతిన రాహువున కుత్తరమున పీతపుష్పాక్షతలతో గణపతిని, పడమర శనికి ఉత్తరమున రక్తపుష్పాక్షతలతో దుర్గను, మధ్య సూర్యునకు ఉత్తరమున పీతపుష్పాక్షతలతో వాయువును, తూర్పున శుక్రునకుత్తరమున నీలపుష్పాక్షతలతో ఆకాశమును, వాయవ్యమున కేతువున కుత్తరమున శ్వేతపుష్పాక్షతలతో అశ్వినీదేవతలను ఇట్లు లోకపాలకును ఆవాహనము చేయవలయును. తూర్పు మొదలుగా దశ దిక్పాలురను ఆవాహనము చేయవలయును. మండలమధ్య కలశమునుంచి బ్రహ్మను ఆవాహనము చేయవలయును.

తూర్పున వాపి అను తెల్లగదులమధ్య యింద్రుని, ఆగ్నేయమున శృంఖలయను నల్లగదులమధ్య అగ్నిని, దక్షిణమున వాపి అను తెల్లగదులమధ్య యముని, నైరృతిన శృంఖలయను నల్లగదులమధ్య నిరృతిని, పడమర వాపి యను తెల్లగదులమధ్య వరుణుని, వాయవ్యమున శృంఖలయను నల్లగదులమధ్య వాయువును ఉత్తరమున వాపి యను తెల్లగదులమధ్య కుబేరుని, ఈశాన్యమున శృంఖలయను నల్లగదులమధ్య శివుని, వాయవ్య ఉత్తరములమధ్య వల్లియను ఆకుపచ్చగదులయందు అష్టవసువులను, కుబేర ఈశానుల మధ్య వల్లియను ఆకుపచ్చగదులయందు ఏకాదశ రుద్రులను, ఈశాన ఇంద్రులమధ్య వల్లియను ఆకుపచ్చగదులయందు ద్వాదశాదిత్యులను, ఇంద్ర అగ్నిహోత్రులమధ్య వల్లియను ఆకుపచ్చగదులయందు అశ్వినీదేవతలను, అగ్నియములమధ్య వల్లియను ఆకుపచ్చగదులయందు త్రయోదశ విశ్వేదేవతలను, యమనిరృతుల మధ్య వల్లియను ఆకుపచ్చగదులయందు సప్తయక్షులను, నిరృతి వరుణులమధ్య వల్లియను ఆకుపచ్చగదులయందు సర్పములను, వరుణవాయువులమధ్య వల్లియను ఆకుపచ్చగదులయందు గంధర్వాప్సరసలను పరిధియను పసుపువన్నె గదులలో తూర్పు మొదలుగా దుర్గ, స్వధ, మృత్యు, గణపతి, ఆపః, మరుత్, స్కంద, దక్ష,

అను 8 మంది దేవతలను, బ్రహ్మయొక్క పాదమూలమున రెండు పసుపుగదులలో పృథివిని, సప్తనదులను, బ్రహ్మస్థాన మంతటను సప్తసాగరములను, బ్రహ్మకు తూర్పున మేరువును, దాని శిఖరమున ప్రధానావాహనమును, యిప్పుడు చెప్పుచున్న సమస్త దేవతా వాహనము అయిన తరువత చెప్పబోవుచున్నాము.

ఈశాన్యమున అర్ధచంద్రుడను పేరుగల తెల్లగదులలో ఋగ్వేదమును, ఆగ్నేయమున అర్ధచంద్రుడను తెల్లగదులలో యజుర్వేదమును, నైరృతిన అర్ధచంద్రుడను తెల్లగదులలో సామ వేదమును, వాయవ్యమున అర్ధచంద్రుడను తెల్లగదులలో అధర్వణ వేదమును ఇంద్ర ఈశానులమధ్య భద్రమను యెఱ్ఱగదులలో అశ్విన్యాది సప్త నక్షత్రములను, ఇంద్ర అగ్నులమధ్య భద్రమను యెఱ్ఱగదులలో విష్కంభాది సప్తయోగములను, అగ్నియముల మధ్య భద్రమను యెఱ్ఱగదులలో పుష్యాది సప్తనక్షత్రములను, యమనిరృతులమధ్య భద్రమను యెఱ్ఱగదులలో ధృత్యాది సప్త యోగములను, నిరృతి వరుణులమధ్య భద్రమను యెఱ్ఱగదులలో స్వాత్యాది సప్త నక్షత్రములను, వరుణ వాయువులమధ్య భద్రమను యెఱ్ఱగదులలో వజ్రాది సప్తయోగములను, వాయుకుబేరులమధ్య భద్రమను యెఱ్ఱగదులలో అభిజిదాది సప్త నక్షత్రములను, కుబేర ఈశానులమధ్య భద్రమను యెఱ్ఱగదులలో సాధ్యాదిషడ్యోగములను ధ్రువుని, మండలముయొక్క వెలుపలి శ్వేతవలయమున వరుసగా కుబేరున కుత్తరమున గదను, ఈశానునకు వెలుపల త్రిశూలమును, ఇంద్రునకు వెలుపల వజ్రాయుధమును, అగ్నికి వెలుపల శక్తిని, యమునకు వెలుపల దండమును, నిరృతికి వెలుపల ఖడ్గమును, వరుణునకు వెలుపల పాశమును, వాయువునకు వెలుపల అంకుశ మును, దానికి వెలుపల యెఱుపువలయమున వరుసగా ఉత్తరమున గౌతముని, ఈశాన్యమున భరద్వాజుని, తూర్పున విశ్వామిత్రుని,

ఆగ్నేయమున కశ్యపుని, దక్షిణమున జమదగ్నిని, నైరృతిన వసిష్ఠుని, పడమర అత్రిని, వాయవ్యమున అరుంధతిని, దానికి వెలుపల నలుపు తెలుపు కలిసిన గదులలో తూర్పునుండి ప్రదక్షిణ క్రమముగా ఎనిమిది దిశలయందు ఐంద్రి, కౌమారి, బ్రాహ్మి, వారాహి, చాముండా, వైష్ణవి, మాహేశ్వరి, వారాహి, అను దేవతలను, ఆవలయముననే ఉత్తరమున పంచమహాభూతములను, తూర్పున విశ్వకర్మను, దక్షిణమున అగస్త్యుని, పడమర పితృగణమును, ఉత్తరమున అష్టకుల పర్వతములను, సిద్ధులను, ఆవాహనముచేసి పూజించవలెను.

ఆసర్వతోభద్ర మండలమునకు దక్షిణమున ఏకాశీతిపద వాస్తు మండలమున శిఖి మొదలగు దేవతలను ఆవాహనముచేసి పూజించవలసిన విధమును చెప్పబోవుచున్నాము. యిప్పుడు సర్వతోభద్రమండలమునమధ్య తామ్రకలశముగాని మృణ్మయ కలశముగాని స్థాపించవలెను. 'భూరసీతి, అను మంత్రముచేత భూమినితాకి 'మానస్తోక, అను మంత్రముచేత గోమయమునుతాకి 'అజిఘ్ర, అను మంత్రముచేత కలశమును స్థాపించవలెను. 'వరుణస్యోత్తమ, అను మంత్రముచేత కలశమున జలముంచి 'వసోఃపవిత్ర, అను మంత్రముచేత కంఠమున వస్త్రమును చుట్టవలెను. 'యాఃఫలీనీ,అను మంత్రముచేత పూగీఫలమును, 'పరివాజ, అను మంత్రముచేత పంచరత్నములను, 'యాఓషధీ, అను మంత్రముచేత సమస్తఓషధులును, 'గంధద్వారా, మను మంత్రముచేత గంధమును, 'కాండాత్కాండా, అను మంత్రముచేత గరికను, 'అశ్వత్థేన, అను మంత్రముచేత పంచపల్లవములును, 'స్యోనాః పథివీ, అను మంత్రముచేత సప్తమృత్తికలను, 'ధాన్యమసీతి, అను మంత్రముచేత సప్తధాన్యములను, 'శ్రీశ్చతే, అను మంత్రముచేత పుష్పములును, 'ధూరసీతి, అను మంత్రముచేత ధూపమును, పూర్ణాదర్వీ అను మంత్రముచేత కలశమునకు పసుపు

గుడ్డతో బియ్యమును మూటగట్టి దానిని కలశమునకుగట్టి పూర్ణపాత్రము నుంచవలెను.

దానిపైన సువర్ణనిర్మితమైన లక్ష్మిని విష్ణువును అగ్నిపైచూపించి ఆప్రతిమలను యెదుట రాగిపాత్రయందుంచి అగ్నిసూక్తమును పఠించుచు వానిపై పాలును జలమును ధారగా పోయవలెను. పురుషసూక్తముతో అంగన్యాసమును ‘పయః పృథివ్యా’ అను మంత్రముచేత పాలతోను ‘దధిక్రావ్ణో’ అను మంత్రముచేత పెరుగుతోను ‘ఘృతం ఘృత’ అను మంత్రముచేత నేతితోను, ‘మధువాతా’ అను మంత్రముచేత తేనెతోను, ‘ఆపోహిష్ఠామ’ అను మంత్రముచేత శుద్ధోదకముతోను స్నానమును చేయించి కలశముపైనుంచి ప్రాణప్రతిష్ఠ చేయవలెను. పురుషసూక్తములచేత షోడశోపచారములతో పూజించవలెను. నైరృతిన వేదికయందు చతుష్కోణ మండలమున 64 యోగినీ గణమును అనగా గజానన మొదలు మృగలోచనవరకు అందరిని ఆవాహనముచేసి పూజించవలెను. వాయవ్య వేదికయందు ద్వాదశకోణ మండలమున అజరుడు మొదలు భైరవుడు వరకు 72 భైరవులను ఆవాహనముచేసి పూజించవలెను. అచ్చటనే 49 మరుద్గణమును ఆవాహనముచేసి పూజించవలెను. పిమ్మట వాస్తుమండలము దగ్గరకువెళ్లి తెల్లని బియ్యముపై కుంకుమ మొదలగు వానితో పైన చెప్పిన ప్రకారముచేసి సర్వజ్ఞానక్రియాశక్తి కమలాసనమును, పీఠముపై పుష్పములును, అక్షతలును, గంధమును, చల్లవలెను. అక్కడ యీశాన్యము మొదలు వరుసగా 45 దేవతలను ఆవాహనముచేసి పూజించవలెను.

వాస్తుపురుషుని శరీరమును తెలిసికొనుచు గదులను తప్పకుండా పూజించవలయును. దేవతాస్థానములను తప్పించి పూజించినట్లయిన దోషము కలుగును. 1. ఈశాన్యమున వాస్తుపురుషుని శిరఃస్థానమున యెఱుపువన్నెగల యొకగదిలో శిఖి, అగ్నిరూప

శివుడు, కుడిచేతులలో స్రుక్కు, శూలములును, ఎడమ చేతులలో డమరుకము, స్రువమును, కలిగి స్వాహా, ఉమా, సహితుడై యెఱుపు వన్నెతో నుండును. తమీశాన, మను మంత్రముతో ఆవాహనము చేసి పూజించవలెను. 2. దానికి దక్షిణమున ఆకుపచ్చవన్నెగల యొకగదిలో యెడమకంటియందు పర్జన్యుడు మేఘాధిపతి, పాశహస్తము మకరవాహనము పసువన్నెకలిగి యుండును. 'మహాఇంద్ర,అను మంత్రముతో ఆవాహనము చేసి పూజించవలెను. 3. దానికి దక్షిణమున నిలువుగానున్న రెండు యెఱుపుగదులలో చెవియందు జయంతుడు సృష్టికర్తయగు కశ్యపమహర్షి, జడలు, గడ్డము, కమండలువు, అక్షసూత్రము, పద్మాసనము పసుపువన్నె కలిగియుండును. 'ధన్వనాగా, అను మంత్రముచేత ఆవాహనము చేసి పూజించవలెను.

4. దానికి దక్షిణమున నిలువుగానున్న రెండు నలుపుగదులలో కంఠమూలమున మహేంద్రుడు దేవతాప్రభువు, వజ్రాయుధము శచీదేవి, ఐరావత వాహనము, కిరీటము, పాశము, పద్మము, రక్తవస్త్రోత్తరీయములు కలిగియుండును 'మహాఇంద్ర, అను మంత్రము చేత ఆవాహనముచేసి పూజించవలెను. 5. దానికి దక్షిణమున నిలువుగానున్న రెండు తెలుపు గదులలో భుజమున సూర్యుడు సప్తాశ్వములుగల రథము చేతియందు పద్మము యెఱుపువన్నె కలిగి యుండును. 'సూర్యరశ్మి, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 6. దానికి దక్షిణముగానున్న రెండు నలుపు గదులలో దండచేతియందు సత్యుడు స్వాయంభుమ్నుకు భూతహిత ధర్మము, బ్రహ్మనిష్ఠ, తెలుపువన్నె కలిగియుండును. 'వ్రతేనదీక్షా, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 7. దానికి దక్షిణమున నిలువుగానున్న రెండు యెఱుపుగదులలో మోచేతియందు భృశుడు మన్మథుడు, పుష్పరథము, పుష్పబాణము,

నలుపువన్నె కలిగియుండును 'భద్రంకర్ణేభి, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను.

8. దానికి దక్షిణమున ఆకుపచ్చవన్నెగల యొకగదిలో ముంజేతియందు అంతరిక్షము ఆకాశము శంఖము చక్రము సర్వాభరణములును ధరించి నలుపువన్నె కలిగియుండును. (మరియు దండము పాశము శూలము వరదము కూడ చెప్పబడియున్నవి) 'వయంసోమ, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 9. ఆగ్నేయముననున్న ఒక యెఱుపుగదిలో ముంజేతియందు అగ్ని తేజస్సముద్భవము, నీలాంబరము, యజ్ఞసూత్రము, ఉత్తరీయము, ద్విభుజంత్రినేత్రము, స్రుక్కు, స్రువము, సర్వాభరణములు ధరించి స్వాహా సహితముగ మేషవాహనముపై నుండును. రక్తవర్ణము, 'అగ్నఆయాహి, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 10. దానికి పడమర ఆకుపచ్చవన్నెగల యొకగదిలో మని కట్టున పూష మాతృదేవతాగణము, పద్మము కమండలువు గజాసనము ఎఱుపువన్నె కలిగియుండును. 'పూషంతవ, అను మంత్రము చేత ఆవాహనముచేసి పూజించవలెను. 11. దానికి పడమర అడ్డముగానున్న రెండు యెఱుపుగదులలో ప్రక్కను వితథుడు, అధర్మను కలిపుత్రుడు, మద్యమాంస రక్తములతో గూడిన హస్తములు గలవాడు, నలుపువన్నెకలిగి యుండును.

'సవితాప్రథమేహా,అను మంత్రముతో ఆవాహనముచేసిపూజించవలెను. 12. దానికి పడమర అడ్డముగానున్న రెండు నలుపు గదులలో ప్రక్కను గృహక్షతుడు బుధుడు గధఖడ్గము, శూలము, శక్తి పాశత్రయము, కిరీటము, రక్తపీతవస్త్రము, సింహవాహనము పసుపు వన్నెకలిగి యుండును. 'సవితాత్వా, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 13. దానికి పడమర అడ్డముగానున్న రెండు తెలుపు గదులలో తొడయందు యముడు, ప్రేతలోకాధిపతి

త్రినేత్రం, ఎఱ్ఱని తలవెంట్రుకలు, కుడిచేతశూలము, ఎడమచేత పాశము, దండము, పంచహస్తములు, రక్తవస్త్రము శ్యామలాదేవీ సహితముగ మహిష వాహనముపై నుండును.

కాటుకవంటి నలుపువన్నె కలిగియుండును. 'యమాయత్వా, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 14. దానికి పడమర అడ్డముగానున్న రెండు నలుపుగదులలో మోకాలియందు గంధర్వుడు, నారదుడు, హస్తమున వీణయును, చుట్టూ అప్సరసలును, ఎఱుపువన్నెయును కలిగియుండును. 'ప్రతద్వోవా, అను మంత్రముచేతను 'గంధద్వారా అను మంత్రముచేతను ఆవాహనము చేసి పూజించవలెను. 15 దానికిపడమర అడ్డముగానున్న రెండు యెఱుపుగదులలో పిక్కయందుభృంగరాజు,నిర్ఋతిసుతుడు, ఖడ్గము, ఖేటము, నలుపువన్నె కలిగియుండును. 'మృత్యుస్సృహర్ణ, అను మంత్రముచేత ఆవాహనముచేసిపూజించవలెను. 16. దానికి పడమర ఆకుపచ్చవన్నెగల యొకగదిలో మడమపై మృశుడు, స్వాయంభువు, శేషునిపై శయనించినాలుగు చేతులలో శంఖము, చక్రము, గద, ఖడ్గము, ధరించి పసుపువన్నెకలిగి యుండును. 'తద్విష్ణు, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను.

17. నైర్ఋతిన యెఱుపువన్నెగల యొక గదిలో పాదముల యందు పితృగణము, విశ్వేదేవతలు, దర్భలు పిండము, నల్లనిజడలు, తెల్లనివస్త్రములు, జందెము, గోరోజనమువంటి రంగుగల కన్నులు, ఎఱుపువన్నెకలిగి యుందురు. 'పితృభ్య, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 18. దానికి ఉత్తరమున ఆకుపచ్చవన్నెగల యొకగదిలో చీలిమండపై ద్వారికుడు ప్రమథగణాధిపతియగు నందీశ్వరుడు, తెల్లనిపావుకోళ్ళు, చేతిలో బెత్తము, పసుపువన్నెయు కలిగియుండును. 'ద్రవిణోయః, అను మంత్రము చేత ఆవాహనముచేసి పూజించవలెను. 19. దానికి ఉత్తరమున

నిలువుగానున్న రెండు యెఱుపుగదులలో పిక్కయందు సుగ్రీవుడు మనుబ్రహ్మ యను ప్రజాపతి, పద్మాసనము, యజ్ఞముచేయుచున్న స్వభావము తెలుపువన్నెయు కలిగియుండును. 'సుషుమ్నః, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 20. దానికి ఉత్తరమున నిలువుగానున్న రెండు నలుపుగదులలో మోకాలియందు పుష్పదంతుడు మహోజవుడగు వినాయకుడు, నాలుగుచేతులును, ఏనుగు మొగమును, సిద్ధి, బుద్ధి, అను ఇద్దరు భార్యలును, సిందూరపు వన్నెయును గలిగియుండును. 'నక్షత్రేభ్యః, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను.

21. దానికి ఉత్తరమున నిలువుగానున్న రెండు తెలుపు గదులలో తొడయందు వరుణుడు జలాధిపతి కిరీటము, ఉత్తరీయము, పాశము, అంకుశము, కత్తి, యజ్ఞసూత్రము, రక్తవస్త్రము, మకర వాహనము, నానాభరణ భూషితుడు, భార్యాసహితుడు, గోధుమ వన్నె కలిగియుండును. 'మిత్రస్య, అను మంత్రముచేత ఆవాహనము చేసి పూజించవలెను. 22. దానికి ఉత్తరమున నిలువుగానున్న రెండు నలుపుగదులలో ప్రక్కను అసురుడు రాహువు, పాశము, శూలము, శక్తి, సింహవాహనము, పసుపుయెఱుపు కలిసిన వన్నె కలిగియుండును. 'యేరూపాణి, అను మంత్రముచేత ఆవాహనము చేసి పూజించవలయును. 23. దానికి ఉత్తరమున నిలువుగానున్న రెండు యెఱుపుగదులలో ప్రక్కను శోషుడు శనైశ్చరుడు నలుపు వన్నెకలిగి యుండును. 'మంత్రమానవే, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 24. దానికి ఉత్తరమున ఆకుపచ్చ వన్నెగల యొకగదిలో మనికట్టున పాపయక్ష్మ్రుడుక్షయుడు. ఎముకల దట్టెమువంటి శరీరము శూలము, శక్తి, ధరించి పసుపువన్నెకలిగి యుండును. 'సూర్యరశ్మి, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను.

25. వాయవ్యమున యెఱుపువన్నెగల యొకగదిలో ముంజేతి యందు మరుత్తు ద్విభుజం త్రినేత్రం, పాశవరద హస్తములు లేడి వాహనము ధూమ్రవర్ణముకలిగియుండును. 'ఆవాయో, అను మంత్రముచేతను 'ప్రాణోశిరోమే, అను మంత్రముచేతను ఆవాహనము చేసి పూజించవలెను. 26. దానికి తూర్పున ఆకుపచ్చవన్నెగల యొకగదిలో ముంజేతియందు నాగుడువాసుకి యను సర్పరాజు, పాముపడగ అక్షము, కుండలములు ధరించి యెఱుపువన్నెకలిగి యుండును. 'నమోస్తుసర్వేభ్యః, అను మంత్రముచేత ఆవాహనము చేసి పూజించవలయును. 27. దానికి తూర్పున అడ్డముగానున్న రెండు యెఱుపుగదులలో మోచేతియందు ముఖ్యుడుత్వష్టయను విశ్వకర్మ, శివస్వరూపము, జడలు, శూలము, పట్టిస, వాస్తుతుంభము, అక్షసూత్రము, మహిషవాహనము, ఎఱుపువన్నెకలిగి యుండును. 'ఇషేత్వా, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 28. దానికి తూర్పున అడ్డముగానున్న రెండు నలుపు గదులలో దండచేతియందు భల్లాటుడు చంద్రుడు పదిగుఱ్ఱములుగల రథమునెక్కి చేతిలో తామరపుష్పమును ధరించి తెలుపు వన్నెకలిగి యుండును. 'విష్ణుహోం, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలయును.

29. దానికి తూర్పున అడ్డముగానున్న రెండు తెలుపు గదులలో భుజమున సోముడు కుబేరుడు పల్లకిలో కూర్చుండి గదచేత బట్టి పెద్దపొట్టయును తెలుపువన్నెయును కలిగియుండును. 'వయం సోమ, అనుమంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలయును. 30. దానికి తూర్పున అడ్డముగానున్న రెండు నలుపు గదులలో కంఠమూలమున భుజగము పర్వతము హిమవంతుడు పీతవస్త్రమును పద్మము, అక్షము, పాశము, పాత్ర, ధరించి తెలుపువన్నెకలిగి యుండును. 'ఉదుత్యం, అను మంత్రముచేత ఆవాహనముచేసి

పూజించవలెను. 31. దానికి తూర్పున అడ్డముగానున్న రెండు మొఖుపుగదులలో చెవియందు అదితి శ్రీదేవి, సూత్రము, వజ్రము, అంకుశము, పద్మము, ధరించి సర్వాభరణభూషితయై పసుపువన్నె కలిగియుండును. 'ఉతనోహిర్బుధ్న్యః, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 32. దానికి తూర్పున ఆకుపచ్చవన్నెగల మొకగదిలో కంటియందు దితి వృషధ్వజయగు శివాస్వరూపము, శూలము, ఖడ్గము, వృషవాహనము, పసుపువన్నెకలిగి యుండును. 'అదితిర్ద్యా, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 33. ఈశాన్యమున శిఖికి దిగువ తెలుపువన్నెగల మొకగదిలో నోటియందు ఆపః సముద్రము 'ఆపోఅస్మా, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను.

34. ఆగ్నేయమున అగ్నికి దిగువ తెలుపువన్నెగల మొక గదిలో చేతియందు సావిత్ర వేదమాత గాయత్రి పద్మాసనము వేదపఠనము, పంచశిరస్సులు, దశహస్తములు, తెలుపువన్నెకలిగి యుండును. 'ఉపయామ, అను మంత్రముతో ఆవాహనముచేసి పూజించవలయును. 35. నైరృతిన పితృగణమునకు పైన తెలుపు వన్నెగల మొకగదిలో మేఢ్రమున ఇంద్రజయుడు కాలాగ్ని 'మర్మాణితే, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 36. వాయవ్యమున వాయువునకు పైన తెలుపువన్నెగల మొక గదిలో చేతియందు రుద్రుడు, జడలు, గంగ, శాంతరూపము, తెలుపువన్నెకలిగి యుండును. 'సుత్రామాణం, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 37. మధ్యనున్న తొమ్మిది మొఖుపుగదులచుట్టూ ప్రదక్షిణక్రమముగా తూర్పున అడ్డముగా నున్న మూడు పసుపువన్నెగదులలో స్తనమున అర్యముడు బృహస్పతి, కిరీటము, ఖడ్గము, పద్మమాల, ధరించి అభయవరద హస్తములను తెలుపువన్నె కలిగియుండును. 'అర్యమ్ణం, అను మంత్రముచేత

ఆవాహనముచేసి పూజించవలెను. 38. దానికి దక్షిణమున ఆగ్నే యమున ఆకుపచ్చ వన్నెగల యొకగదిలో చేతియందు సవిత జాహ్నవి, గంగ, చేతిలో పద్మము, బాహుపురులు, కుండలములు, ఎఱుపువన్నెయు కలిగియుండును. 'సవితాప్రసవిత్రా, అను మంత్రముచేతను 'ఉపయామ, అను మంత్రముచేతను ఆవాహనముచేసి పూజించవలెను. 39. దక్షిణమున నిలువుగానున్న మూడు పసుపువన్నె గదులలో పొట్టయందు వివస్వంతుడు మృత్యువు, 4 చేతులు పాశము, అంకుశము, శ్వేతవర్ణము కలిగియుండును. 'వివస్వన్, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలయును.

40. దానికి పడమర నైరృతిన ఆకుపచ్చవన్నెగల యొక గదిలో మేఢ్రమున ఇంద్రుడు సురాధిపతి ఐరావతారూఢుడు చుట్టూ అప్సరసలును వజ్రాయుధము ధరించిన బలమైన శరీరమును ఎఱుపువన్నెయు కలిగియుండును. 'ఇంద్రః సుత్రామా, అను అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలయును. 41. పడమర అడ్డముగానున్న మూడు పసుపువన్నె గదులలో పొట్ట యందు మిత్రుడు బలభద్రుడు, హలము, మాల, వజ్రము, అబ్జము ధ్వజమునుధరించి తెలుపువన్నె కలిగియుండును. 'తన్మిత్రస్య, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలయును. 42. దానికి ఉత్తరమున వాయవ్యమున ఆకుపచ్చవన్నెగల యొకగదిలో చేతి యందు రాజయక్ష్ముడు, స్కందుడు కుమారస్వామి, బ్రహ్మచారి, శక్తిని ధరించినవాడు, మయూరవాహనము, ఎఱుపువన్నె కలిగి యుండును. 'అభిగోత్రాణి, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలయును. 43. ఉత్తరమున నిలువుగానున్న మూడు పసుపు వన్నెగదులలో స్తనమున పృథ్వీధరుడు అనంతుడు, వేయితలలు శంఖము, చక్రము, అక్షము, కుంభము, ధరించి యెఱుపువన్నెకలిగి యుండును. 'పృథివీఛందః, అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను.

44. దానికి తూర్పున ఈశాన్యమున ఆకుపచ్చవన్నెగల యొక గదిలో తొమ్మిన ఆపవత్స ఉమాదేవి కుంభము, పాశము, సింహ వాహనము, తెలుపువన్నె కలిగియుండును. 'భవతన్నస్య' అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలెను. 45. మధ్యనున్న తొమ్మిది యెఱుపువన్నె గదులలో హృదయమున పద్మసింహాసనమున బ్రహ్మ నాలుగుముఖములు నాలుగుచేతులు అక్షమాల అభయములు కుడివైపునను, కమండలువు వరదములు యెడమవైపునను, తెల్లనివస్త్రము తెల్లనిఉత్తరీయము, యజ్ఞోపవీతము, జటామాళి, కర్ణకుండలములు, సర్వాభరణములు పాటలవర్ణము కలిగి విశ్వకర్మనామముధరించిన సహస్రముఖుడగు జగత్కర్త 'ఆబ్రహ్మన్' అను మంత్రముచేత ఆవాహనముచేసి పూజించవలయును. మండలమునకు వెలుపల యీశాన్యము మొదలు నాలుగుమూలలయందు చరకి, విదారి, పూతన, పాపరాక్షసి, అను నలుగురిని, తూర్పు మొదలుగ నాలుగు దిశలయందు స్కంద, అర్యమా, జృంభక, పిలిపిచ్ఛ అను నలుగురిని ఇట్లే మరల తూర్పు మొదలుగా గణేశ, దుర్గ, వాత, బీభత్స అను నల్వురను, మరల అచటనే వరుసగా ఉగ్రసేన, డామర, మహాకాల, అశ్విసీ దేవతలజత, అనులోకపాలురను, తూర్పునుండి వరుసగా ఇంద్ర, అగ్ని, యమ, నిరృతి, వరుణ, వాయు, కుబేర, ఈశానులను, ఈశాన పూర్వదిశలమధ్య రుద్రుని, నిరృతి పడమరదిశలమధ్య భూమిని ఆవాహనముచేసి పూజించి వాస్తుమండలమున తూర్పు మొదలు నాలుగుదిశలయందు స్థాపించబడిన నాలుగు కలశములను ప్రత్యేకనామములతో పూజించి మధ్య కలశమును, దానికి ప్రదక్షిణక్రమముగా అందఱు దేవతలను, షోడశోపచారములతో పూజించవలెను.

సకలాది చంద్రకాంతాంతం ముప్పదియిద్దరు పదదేవతలకు నమస్కరించి మండలమధ్యనొకఘటమును స్థాపించి ప్రధానవాస్తుపురు

షుని ప్రతిమ నొకరాగి పళ్లెమునందుంచి అగ్నిపై చూపి సమంత్రకముగా క్షీరధారను జలధారనువిడిచి బీజయుక్తముగ ప్రాణప్రతిష్ఠను చేసి మండలముమధ్య నొకఘటమును స్థాపించవలెను. అందు పంచపల్లవములు. పంచరత్నములు, ఫలములు, కానుక, సమస్త ఓషధులు జువ్వి జటామాంసి, వస, కచ్చూరములు, జాతిపువ్వు, పసుపు, మానిపసుపు, శొంఠి, సంపంగి, తుంగగడ్డ, గరికదర్భ మొదలైనవి. అశ్వగజవృషభ స్థానములను, పుట్టను, నది, నదీసంగమ, చతుష్పథ తీర్థప్రదేశములను, పర్వతశిఖరమునను, కలమృత్తికను దెచ్చి యందుంచి వరుణుని ఆవాహనముచేసి పూజించి పురుషసూక్తవిధానముగా షోడశోపచారములతో పూజించవలెను. అంతట పాయసాన్నమును బలిని పెట్టవలయును. “సూత్రశాస్త్రక్రియాప్రాజ్ఞో వాస్తువిద్యాబ్ధిపారగః శైవ వైష్ణవ శాక్తేయంగాణాపత్యంచ చౌద్ధకం, కాపాలికంచ పడ్దర్శం, నిర్మితం స్థాపితం తథా। శ్రౌతస్మార్తక్రియా ప్రాజ్ఞో, మంత్రతంత్రార్థ కోవిదః...ఏవంగుణ గణైర్యుక్తః శిల్పాచార్య స్సరోచ్యతే ॥ (మయశిల్పశాస్త్రం) శిల్పాచార్యుడే షణ్మత విగ్రహస్థాపనాధికారి కనుక అంతట ప్రతిష్ఠింపదలచిన లింగమునుగాని, దేవప్రతిమనుగాని, దేవీప్రతిమనుగాని, భక్తప్రతిమనుగాని, వాహనమునుగాని, ఉత్సవవిగ్రహమునుగాని, నానావిధములైన విగ్రహములను వాస్తుశాస్త్రప్రకారము చక్కగా ప్రతిష్ఠ చేయవలయును. అటులచేసిరేని యజమానుడును తన గ్రామమును తన దేశమును సుఖముగానుండిన క్రమమైన వర్షములు కురియుచు సమస్తమైన పైరులు పంటలు ఫలవృక్షములు చక్కగా ఫలించి గోవులు చక్కగా పాలుయిచ్చుచు ప్రజలకు రోగములు ఉపద్రవములు లేకుండా సంపూర్ణాయుష్యముతోను మంచిబుద్ధులతోను దేశము సుభిక్షముగాను ఉండును.

వాస్తుశాస్త్రమున చెప్పబడిన ప్రకారము చేయనియెడల అందలి దోషములవలన యజమానుడును తన వంశమును నశించు

టయేకాక గ్రామమునకు దేశమునకుగూడ రోగములు ఉపద్రవములు మొదలయినవి కలుగును. కనుక సమస్త ప్రతిమలు వాస్తుశాస్త్రము ననుసరించి చేయవలెను. శిల్పాచార్యుడు విశ్వకర్మకులోత్పన్నుడును, వేదములను శాస్త్రములను చక్కగా చదివినవాడును, రోగములేనివాడును, అవయవములన్నియు చక్కగా కలవాడును, సత్యవాక్యము కలవాడును, ధర్మప్రవర్తనుడును, మంత్రశాస్త్రములు ఆగమశాస్త్రములు మొదలయినవాని యొక్క పద్ధతులను దెలిసినవాడును, కుటుంబము కలవాడును, సదాచారము కలవంశమున బుట్టినవాడును, సమస్త కర్మములయం దాసక్తికలవాడును, దేవతా ప్రతిష్ఠలయందు నేర్పరియును, శాంతముకలవాడును, సజ్జనులచే స్తుతింపబడువాడును, బ్రహ్మజ్ఞానియును, జపము మొదలయినవానికి శక్తిగలవాడును, సులభముగా గ్రహించునట్టివాడును, శుభలక్షణములు కలవాడును, వేదోక్తకర్మకలవాడును, సమయమును గుర్తించి ప్రవర్తించునట్టివాడును, అన్ని శాస్త్రముల నెఱిగినవాడును, ఇట్టి గుణములుగల శిల్పాచార్యుని దైవసమానునిగా భావించి అతడు స్నానముసంధ్య, జపముహోమము వేదమంత్రపఠనము, పితృతర్పణము, అతిథిపూజ, వైశ్వదేవము మున్నగునవి చేసికొని బాహుపురులు, హారములు, కిరీటము, కంకణములు, విసనకఱ్ఱ, ముందుపతాక, చామరము, మొదలగువానితో ప్రకాశించుచు యజమానుడును, సమస్తజనులును, తనవెంటనుండి సేవించుచుండగా విగ్రహమును యాజుషాథర్వణ మహాశిల్పోపనిషత్తు విశ్వకర్మోపనిషత్తు మొదలగు వేదమంత్రపఠనములోను నృత్యగీతాది సహితముగ ఊరేగింపుతో తెచ్చి యజ్ఞశాలయందుంచి పుణ్యాహవాచనము చేయవలెను.

మరియు ప్రతిష్ఠింపబడు దేవునికి ప్రధానవేదికయందు ప్రాగ్భాగమున శాస్త్రోక్తముగా కుంభమునుంచి యందు పంచపల్లవములు,

పంచరత్నములు, మారేడుపండు, ఫలములు, కానుక, సమస్త ఓషధులు, సప్తమృత్తికలు, దర్భలు పుష్పమాలలు, మొదలయిన వానితోను పసుపుగుడ్డను బియ్యము మూటగట్టి దానిని కుంభమునకుగట్టి కంకణముకూడకట్టి ఆవాహనముచేసి షోడశోపచారములతో పూజించవలయును. పిదప కుశకండిక పంచభూ సంస్కార పూర్వకమగు స్థాపితాగ్నికి ప్రదక్షిణముచేసి పుష్పములు గంధము దక్షిణతాంబూలము, వస్త్రములనుతెచ్చి అగ్నికి దక్షిణపువైపుననుండి వస్త్రములను పీటను అగ్నికిపైగాతీసి బ్రాహ్మణుని పాదప్రక్షాళన గంధమాల్యాదులతో పూజించి హస్తమునందు ధౌతవస్త్రము, ఉత్తరీయము, కమండలువు, అంగుళీయకము, కంకణము, భూషణములను పట్టికొని శ్రీపరశివ విశ్వకర్మాగమోక్త ప్రకారము ఏతద్దేవతాప్రతిష్ఠాహవనకర్మమున(చేసినది చేయనిది చేయవలసినది హెచ్చరించునట్టి బ్రహ్మకర్మ) ఆచారత్వముచేయుటకు నిన్ను బ్రహ్మత్వమునకు కోరుచున్నాను. అని అవియన్నియు నీయవలెను. సరే అంగీకరించుచున్నానని పల్కుచు అవి తీసికొనవలెను.

'వ్రతేనదీక్షా, అను మంత్రముచేత కంకణమును 'యుంజంతి, అను మంత్రముచేత తిలకమును ధరించినపిదప యజమానుడు ఈ యజ్ఞమును శాస్త్రోక్తముగా చేయవలసినది అని కోరవలెను. అటులనే చేయుదునని బ్రహ్మపలుకవలెను. ఈయజ్ఞకర్మమునందు నాకు నీవే బ్రహ్మవు. అనగానే అటులనే అని బ్రహ్మ చెప్పవలెను. బాణప్రహారణమునందు కవచమెట్లు రక్షణమో అటులనే ఆయా దైవోపఘాత పరిహారమునకు హోమములు శాంతియని తెలియవలెను. అగ్నికుండమునకు దక్షిణపుదిశనున్న పీటపై కూర్చుండ నియమించవలెను. తర్వాత సంస్కరింపబడిన పాత్రమును ఉలిమిరిచెట్టు కఱ్ఱతో 12 అం. పొడవు 4 అం. మధ్య గుంట గుండ్రముగాచేసి దానిని నీళ్ళతోనింపి దర్భలతోకప్పి బ్రహ్మయొక్క ముఖమును

చూచి అగ్నికి ఉత్తరదిశ దర్భలతో అలంకరించవలయును. తరువాత దర్భలను చుట్టూపఱచవలెను. 81 దర్భలను 20 చొప్పున 4 భాగములు చేసి 1 మాత్రము చేతిలోనుంచుకొని (అనగా యజ్ఞముచేయుచు రిక్తహస్తముతో నుండకూడదు) మొదటి భాగమును దీసికొని ఆగ్నేయమున మొదలు ఈశాన్యమున చివర, రెండవ భాగమును దీసికొని నైరృతిన మొదలు ఆగ్నేయమున చివర, మూడవ భాగమును దీసికొని నైరృతిన మొదలు వాయవ్యమున చివర, నాల్గవ భాగమును దీసికొని వాయవ్యమున మొదలు యీశాన్యమునచివర, ఇట్లుంచవలెను. దీనిని పరిస్తరణమందుగు.

తరువాత అగ్నికి ఉత్తరమున పడమరదిశయందు పవిత్రచ్ఛేదనముకొఱకు 3 దర్భలు, పవిత్రము చేయుటకు చివరలతో కూడినవి మూలము కలవియగు 2. దర్భలను, ప్రోక్షణపాత్రము, ఆజ్యపాత్ర, చరుపాత్ర, చిమ్మటకు కట్టిన దర్భలకట్ట, 5 దర్భలు ఇవి యుపయమకుశలు, 7 సమిధలు, 8 అం. పొడవు (జుత్తిలి)న, స్రువము, తాంబూలములో వేసికొను పోకచెక్కల యుండ ఆజ్యము, 256 గుప్పిళ్ళతో పట్టికొని తెంపిన దర్భలు, బియ్యముతో నిండినపాత్ర, దక్షిణ, బహుమానము, పవిత్రచ్ఛేదన కుశలకు పూర్వ పూర్వదిశ క్రమముగా వీనిని తీసికొనవలెను. పిదప పవిత్రచ్ఛేదనకుశలు మూటిచేత రెండు దర్భలను ఛేదించి దర్భయున్న చేతితో సంస్కరింపబడిన జలమును మూడు, ప్రోక్షణపాత్రమునందుంచి ప్రోక్షణపాత్రను యెడమచేతియందుంచి కుడిచేతి అనామిక అంగుష్ఠముల చేత దర్భలను గ్రహించి మూడుసారులు పైకెత్తి పిదప ప్రోక్షణపాత్రను సంస్కారిత జలముతోనింపి నేలపైన పడవేయవలెను. అప్పుడు ప్రాయశ్చిత్తమునకు గోదానమును చేయవలయును. పిమ్మట ప్రోక్షణపాత్రమునందుగల నీళ్ళతో పట్టికొని వస్తువులపై ప్రోక్షించడమేలాగనిన, అగ్నిదర్భలమధ్య

ప్రోక్షణపాత్రము నుంచవలెను. ఆజ్యస్థాలియం దాజ్యము నుంచవలెను. చరుపాత్రమున (హవ్యమునువండెడి కుండ) అన్నము నుంచవలెను. ఆజ్యమునుకాచుట మండుచుండే దర్భనుతీసికొని దానిపైన చుట్టూ త్రిప్పి అగ్నియందు దాని నుంచవలెను. తదుపరి స్రువమును అగ్నిపై చూపి దర్భలకట్టచేత స్రువమును తుడిచి మొదలుతో మొదలు, నడుముతో నడుము, చివరతో చివర, కాచి స్రువమును దక్షిణమున నుంచవలెను. తరువాత ఆజ్యమును అగ్నిపైచూపించి చూడకుండ దానినొక ప్రక్కను త్రోసివేయవలెను. తరువాత ఉపయమనమను 5 దర్భలను తీసికొని యెడమచేతియందుంచి అగ్నికి చూపించి లేచుచు మనస్సులో 'ప్రజాపతి, అను బ్రహ్మనుధ్యానించి ఊరకుండి నేతిలోముంచిన 3 సమిధలు అగ్నియందుంచవలెను. కూర్చుండి పవిత్రప్రోక్షణ పాత్రమునందలి యుదకముచేత అగ్నిని ప్రోక్షించి దర్భలను ప్రణీతపాత్రయందుంచి కుడిమోకాలును భూమిపై ఆనించి దర్భతో బ్రహ్మతోసహా ఆరంభించి అగ్నియందు స్రువముతో ఆజ్యమును ఆహుతి యీయవలయును. అక్కడ అఘోర మొదలు 12 ఆహుతులు అంత్యమున స్రువమునందున్న మిగిలిననేయి ప్రోక్షణపాత్రమునం దుంచవలెను. ఇది కుశకుండిక విధి. ఇది ప్రథమదినకర్తవ్యము. ద్వితీయదినమున యజ్ఞమున నావాహనము చేయబడిన వారిలో ప్రధాన దేవతలకు సహస్రనామపూజ తగిన హోమములును, ఇతర దేవతలకు సామాన్యపూజలును, తగిన హోమములును చేయవలయును.

మూడవదినమున విగ్రహమును బండిపై నెక్కించి కుడివైపున శిల్పాచార్యుడు కూర్చుండి వేదపాఠములతోను వాద్యఘోషముల తోను దేవాలయమునకు తూర్పుగాని ఉత్తరమునగాని యున్న నదికిగాని తటాకమునకుగాని ఊరేగింపుతో వెళ్ళి యచట జలాధివాసమును కల్పోక్తప్రకారము చేయించవలయును. అచటినుండి

అన్ని దిక్కులయందు శాస్త్రోక్తప్రకారము బలియిచ్చుచు ఊరేగింపుతో కర్పూరనీరాజనాదులతో విగ్రహమును యజ్ఞశాలకు చేర్చవలెను. అక్కడ గుమ్మడికాయ కొబ్బరికాయలు పగులగొట్టి రక్తాన్నమును బలియిచ్చి విగ్రహమునకు గట్టిన వస్త్రములు మొదలగునవి యూడదీసి మరల నూతన వస్త్రపుష్పమాల్యాదులను ధరించి శాలలో ప్రవేశపెట్టవలయును. తదుపరి కల్పోక్తమంత్రయుతముగ ధాన్యాధివాసమును తర్వాత మూర్తిహోమమును చేయవలెను.

నాలుగవ దినమున అంగవైకల్య హోమమును, (నేత్రోన్మీలనము) ను అక్షిమోచనము విధిప్రకారము చేయవలయును.

మానసారము 70 వ అధ్యాయమున నిట్లు చెప్పబడియున్నది.

"పశ్చాత్తు స్థపతిః ప్రాజ్ఞః కల్పయేద్ద్వారు పీఠకం ।
క్షౌమేణాచ్ఛాదనం కుర్యా దంతః కూర్చైరలం కృతం ॥
వేదికోపరి శాల్యేన కుర్యాన్మండలం బుధః ।
పంచవింశ త్పదంవాఽథ కల్పయేత్పీఠమేవనా ॥
దర్భైరాస్తీర్యపశ్చాత్తు శుద్ధతండుల రేఖయా ।
నానాపుష్పైశ్చ లాజైశ్చ ప్రోక్షయేచ్ఛోభనార్థకం ॥
నవకుంభై ర్యవై ర్వాపి పంచవింశభిరేవవా ।
విధివత్ క్షాళయేత్సర్వం సూత్రైరావేష్టనం భవేత్ ॥
శుద్ధతోయేన సంపూర్య వేదికోపణవిన్యసేత్ ।
మధ్యే ప్రధాన కుంభంస్యా దన్యేక్రమాత్సమంతతః ॥
సర్వవస్త్రైశ్చసంవేష్ట్య సకూర్చాద్య ప్రపల్లవైః ।
సవిధానఫలైశ్చైవ పుష్పమాలైరలంకృతం ॥
ఉపవేద్యుపరిస్థాప్య చోక్తవచ్చాష్ట మంగళం ।
పశ్చాత్తుశిల్పిభిః ప్రాజ్ఞైః పాదప్రక్షాళనం కురు (క్రియేత)

విద్యుక్తాచమనంకుర్యా త్సకలీకరణం క్రమాత్ ।
పుణ్యాహం వాచయిత్వాఽథ ప్రోక్షయేత్ప్రతిమాదికం ॥
ధూపదీపందదేద్ద్యా త్వాజ్ఞోమధ్యకుంభస్య మధ్యమే ।
ఆరాధ్యగంధపుష్పైశ్చ భువనాధిపతిం జపేత్ ॥
ఘృతగుడశస్యదధిక్షీరాన్నం వానివేదయేత్ ।
దర్శయేద్ధేనుముద్రాదీన్ గీతాదిన్నృత్త ఘోషణైః ॥
తదగ్రేస్థపతిః ప్రాజ్ఞోహోమం కుర్యాత్తతః క్రమాత్ ।
సమిదాజ్య చరులాజప్రత్యేకాష్టోత్తర శతాహుతిః ॥
శుద్ధతోయేన పంక్తిర్వా పంచవింశతిరేవవా ।
హృల్లేఖం బీజముచ్చార్య స్వాహాంతం ప్రణవాదికం ॥
బింబంగాయత్రి మంత్రేణ పూర్ణాహుతించ కారయేత్ ।
అగ్నికార్యావసానేతు విధివద్బింబమాశ్రయేత్ ॥

శిల్పాచార్యుడు నైరృతిన ఒకదారు పీఠమునందుంచి యందు నూతన వస్త్రమునుపఱచి బియ్యమునుపోసి యందు 25 గదులు వచ్చునట్లు సమముగా తూర్పుపడమరలు 6 గీతలును ఉత్తర దక్షిణములు 6 గీతలును గీయవలెను. దీనిని ఉపపీఠమని వాస్తుశాస్త్రజ్ఞులు చెప్పుదురు. దానిపై దర్భలు, పుష్పములు, పేలాలు, ఉంచి అందు 9 కలశములనుగాని 25 కలశములనుగాని ఉంచి సర్వాలంకారయుక్తముగ వేద మంత్రములతో షోడశోపచారములతో పూజించి విగ్రహముపై యాకలశములన్నిటిజలమును ప్రోక్షించి కలశములకుద్వాసము చెప్పి తీసివేసి అందు విగ్రహమును నిలుపవలెను. శిల్పాచార్యుడు మంగళాష్టకమును చెప్పి మరల శిల్పాచార్యుడు పదప్రక్షాళనాదులను చేసి ఆచమనముచేసి కర్మణః పుణ్యాహవాచనముచెప్పి వాస్తు హోమమును చేయనలయును. సమిధలు, ఆజ్యము, లాజలు, చరువు, వీనితో ప్రత్యేకముగ ఒక్కొక్క దానితో 108 హోమములు చేయవలెను.

తదుపరి శుద్ధోదకముతో 10 హోమములుకాని, 25 హోమములుకాని చేయవలెను. ప్రణవము మొదలుగను స్వాహా అంత్యముగను గాయత్రీ మూలమంత్రముతో పూర్ణాహుతి చేయవలయును. తదుపరి విగ్రహము దగ్గరకువచ్చి నూతన వస్త్రములు, పుష్పములు, గంధము, మొదలగువానితో నలంకరించి యాదేవునికి దగిన వాహనముగాని లేక శకటముగాని తెచ్చి యందుంచి శిల్పికుడివైపున నుండి వివిధ వాద్యములతోను, నృత్యగీతాదులతోను, స్వస్తి మంత్రములతోను నీరాజనపురస్సరముగా గ్రామ ప్రదక్షిణము చేయవలయును. అంతట శిల్పాచార్యుడు ఆ వస్త్రాదులనుతీసి వేఱువస్త్రములనుధరించి గుమ్మడికాయలను కొబ్బరికాయలను కొట్టించి 'యేభూతా ప్రచరంతి, అను మంత్రముతో రక్తాన్నమును బలినిపెట్టవలెను. తరువాత బింబమును మహాశిల్పోపనిషత్పఠనముతో యజ్ఞశాలయందు చేర్చవలెను. మండపమునకు ఉత్తరము, తూర్పు, ఈశాన్యము, ఈమూడు దిశలలో నెక్కడనైనాసరే ఒకహస్త ప్రమాణముకల చతుష్కోణ గర్తమును నిర్మించవలెను. దీనిని సకలము అని చెప్పుదురు. అందు విగ్రహముచుంచి పంచగవ్యములు, పంచామృతములు, పంచత్వగ్రసములు, పంచపల్లవములు, మొదలగువానితో వేదమంత్రయుతముగ స్నానములు చేయించి తదుపరి విగ్రహమునకు నూతన వస్త్రములనుగట్టి గంధ పుష్పాక్షతాదులతో నలంకరించి తదుపరి పూర్వమువలెనే మరియొక గర్తము ను త్రవ్వించి యందు గోక్షీరమునుబోసి నూతన వస్త్రాద్యలంకృతమైన ప్రతిమను అందుంచవలెను. విశ్వకర్మోపనిషత్తును పంచబ్రహ్మోపనిషత్తులను పఠించుచుండవలెను.

'పంచామృతస్నానపరం బింబంక్షీరాధివాసయేత్ । పూర్వవద్గర్తసం కుర్యాత్। స్థాపయిత్వా యథావిధిః ॥ కలశాది విధానం చావాహానాది యథావిధిః। శుద్ధగోక్షీరమాపూర్య। మౌంజీ బంధంచ

బింబకం॥ నూత్నవస్త్రాదిభిర్యుక్తం। బింబక్షీరప్రవేశనం। యామం వాపితదర్ధంవా। ఘటికాద్వయమేవనాం॥ విశ్వబ్రహ్మోపనిషదా। తూర్యఘోషైః ప్రవేశకం। ఏవం విధానతః కుర్యాత్ పశాచ్ఛుద్ధజీవేనతు। పఠేయత్సంచ బ్రహ్మోప। నిష దేకాదశావృతిం। స్నాపయిత్వాత్వలంకారం। కుర్యాత్తంబేరముత్తమం॥ (గార్గేయాగమం 6వ అధ్యాయం)

తదనంతరము శుద్ధోదక స్నానముచేయించి నూతనవస్త్రాదులతోను, గంధపుష్ప మాలికాదులతోను అలంకరించవలెను.

ఐదవదినమున గర్భాలయ ప్రవేశమును, పీఠస్థాపనమును, రత్నన్యాసమును అష్టబంధనమును కలశప్రతిష్ఠను, ధ్వజప్రతిష్ఠను, కళావాహనమును, దృష్ట్యోపనమును కల్పోక్తప్రకారముచేసి యజ్ఞమునుగూడ పూర్ణాహుతిచేసి అన్నదానాది విధులు సక్రమముగా నిర్వర్తించవలెను. అన్నశాంతి తక్కువయైనచో యజమానునకును గ్రామమునకును నానారిష్టములు సంభవించును.

హోమములవిధిని చెప్పుచున్నాను. 4 భాగములు నువ్వులు 3 భాగములు నేయి, 2 భాగములు తెల్లగోధుమలు, 1 భాగము బియ్యము, అర్ధభాగము చక్కెర, ముఖవస్త్రమును, ఆహుతి యీయవలెను. యవలు అధికమైన ఆయుఃక్షీణమును, యవలు నువ్వులతో సమానమైన ధననాశమును, కనుకపై చెప్పిన భాగముల ననుసరించి అన్నికోరికలు నెరవేరుటకు యెల్లప్పుడు నువ్వులు యెక్కువగానే వ్రేల్చుచుండవలయును. ప్రజాపతి మొదలగు ముఖ్యదేవతలకు ఆహుతులనిచ్చి ప్రాయశ్చిత్తహోమములను చేయవలయును. తరువాత పంచవారుణీ హోమములను, ఇట్లు బ్రహ్మోపవేశనాది పాత్రాసాదనమునుచేసి యందు విశేషముగా రావి,చంద్ర, మారేడుపండ్లుగాని లేక విత్తనములుగాని, పాయసము మొదలగు

నవి యెంతవఱకు లభించితే అంతవఱకు బలిని పెట్టవలయును. నేయి భాగముల ప్రకారము ఆహుతి చేసినపిదప మరల స్రుక్కులో నాలుగుసారులు నేయిపోసి ఆగ్నేయము మొదలు చతుః స్తంభ స్థానములయందు తత్తన్మంత్రములతో ఆహుతు నీయవలెను.

తరువాత ఉత్తరమున జలపాత్రమునుంచి బ్రహ్మను మంత్రముతో పూజించి బ్రహ్మయొక్క అనుజ్ఞనుపొంది మరల ప్రవేశించి తదుపరి దిక్పాలురకును, మాతృకా దేవతలకును, లోకమాతృకా దేవతలకును, ఘృతమాతృకా దేవతలకును, యోగినీ దేవతలకును, భైరవగణమునకును, మరుద్గణమునకును, హోమములు చేసి సమిధలు, ఆజ్యము, అన్నము, నువ్వులు, గుగ్గిలము, పరిమళద్రవ్యములు, మొదలగు హోమములను చేయవలయును. పిమ్మట యజమానుడు అగ్నికి దక్షిణమున గూర్చుండి సమస్తదేవతలకు హోమద్రవ్యములతో ఒక్కొక్కరికి హోమములు చేయవలయును. ఎక్కువమంది ఋత్విక్కులుండి చేయించిన హోమమునందు ప్రత్యాహుతి త్యాగము అవశ్యము కనుక ఒకటిగనే చేయవచ్చును.

తరువాత ఆచార్యఋత్విజులు ప్రధానహోమములు చేయవలయును. సూర్యాది నవగ్రహములకు వరుసగా జిల్లేడు, మోదుగ, చండ్ర, ఉత్తరేను, రావి, మేడి, జమ్మి, గరికదర్భ, ఇవి సమిధలు, ఒక్కొక్కటి (8) అం. పొడవుండవలెను. నవగ్రహములకు జిల్లేడు మొదలగు సమిధలు ప్రత్యేకముగ (108) చొప్పునగాని లేక 28 చొప్పునగాని, లేక 8 చొప్పునగాని చేయించి తిలలతోగాని ఆజ్యముతోగాని ఆయా మంత్రములతో హోమములను చేయించవలయును. అన్నము చెప్పబడినప్పు డాజ్యముకూడ యుండవలెను. సర్వతో భద్రమండల దేవతలలో గణపతి మొదలుగ నూటఅరువది ముగ్గురు దేవతలకు హోమములు చేయవలెను.

తరువాత ప్రధానహోమములుచేసి వాస్తుమండల దేవతలకు శిఖి మొదలగువారికి ప్రత్యేకముగ 108గాని, 28గాని,8గాని జుత్తేడు పొడవుకల మేడి సమిధలు, నువ్వులు, నేయి, పాలు, వీనితో హోమములు చేయవలెను. ఇవి దొరకనప్పుడు రావిపుల్లతోనైన చేయవలయును. సమిధలన్నియు తేనె, నేయి, పాలు, వీనితో తడిపి యుంచవలెను. నువ్వులు నల్లనివి ముఖ్యము. పాలు ఆవుపాలు ముఖ్యము. తిలలయందు గోధుమలు కొద్దిగా కలుపవలెను. సమిధలు, నువ్వులు, పాలు, నేయి, వీనితో నాలుగు ఆహుతులు, వాస్తోష్పతేత్యాది మంత్రములతో వాస్తుపురుషునకిచ్చి తరువాత స్థాలీపాకముతో 6 అహుతులనుయిచ్చి, నేతిలో మారేడుపత్రిగాని, మారేడు విత్తనములుగాని, ముంచి పూర్వోక్త చతుర్మంత్రములచేత ఒకొక్క మంత్రముతో 5.5 గాని లేక 1.1 గాని వ్రేల్చవలెను. 'వాస్తోష్పతేధ్రువా, అను మంత్రముచేత మేడిపుల్లలు (ఉదుంబర సమిధలు) 108 హోమములు చేయవలయును. తరువాత బ్రహ్మ మొదలగు 45 దేవతలకును చరకి మొదలగు 16 దేవతలకును, ఇంద్రాద్యష్ట దేవతలకును, రుద్రునకును భూమికిని, శక్తికొలది ఆజ్యముతో ఆహుతులనీయవలెను. వాస్తుమండల దేవతలు 72.

తరువాత అఘోరమంత్రముచేత వాస్తు మర్మసంధానము కొఱకు నువ్వులతో గోధుమలుకలిపి తేనె, నేయి, వీనితో 108 ఆహుతుల నీయవలెను. పిమ్మట విరాడ్విశ్వకర్మకు 'యఇమా, అను మంత్రముతో గంధపు పుడకలు, తిలలు, పాయసము, ఆజ్యము, వీనితో 108 హోమములును, వేదమాత గాయత్రీదేవికి పైజెప్పిన ద్రవ్యముతోనే 108 హోమములును, పంచబ్రహ్మలు పంచశక్తులు మొదలగు 125 మహర్షులు 125 స్త్రీ దేవతలు వీరికిని నవబ్రహ్మలకును, ఒకొక్కరికి 28 గాని 8 గాని యథాశక్తి హోమములను చేయవలయును. పిమ్మట ప్రతిష్ఠించుచున్న ప్రధాన దైవము నుద్దే

శించి ఫలహోమమును, గుగ్గులహోమమును చేయవలెను. శ్రీసూక్తముతో 108 హోమములు చేయవలెను. స్విష్టకృద్ధోమమును, పంచవారుణీ హోమములునుచేసి హోమాంతమున సుగంధపుష్పమాల్యాదులతో నవగ్రహాద పూజనము, వాస్తుమండల దేవతాపూజనము, ప్రధాన దేవతాపూజనము మున్నగునవిచేసి వరుసగా బలులను పెట్టవలయును. బలిద్రవ్యమనగా బ్రాహ్మణుడు కల్లు, మాంసము మొదలైనవి తాకకూడదు కనుక నేతితోకూడిన పాలను బలిని పెట్టవలయును. ఆ యా దేవతలననుసరించి గుమ్మడికాయ, నిమ్మకాయ మొదలగునవికూడ బలియిచ్చుచుండవలెను. ఏదేవత కెట్లు చెప్పియున్నదో అటులే బలిని యీయవలెను. లేనిచో పాలను బలిగా నీయవలెను. దర్భ, పుష్పము, దధి, అక్షతలు, నేయి, వీనితో బలి యిచ్చుచుండవలెను. ఒక పాత్రమునందు పెరుగు అన్నము, దీపము, రక్తచందనము, ఎఱ్ఱనిపూలు, ఎఱ్ఱని అక్షతలు, సువర్ణదక్షిణతో 'ఆబ్రహ్మన్, అను మంత్రముచేత బ్రహ్మకు క్షీరాన్నము, వరిపేలాలు, నువ్వులు, మినుపకుడుము, పంచామృతములు బలినిపెట్టవలయును.

ఇటులే పెరుగు అన్నము, దీపము, రక్తచందనము, ఎఱ్ఱని పూలు, ఎఱ్ఱని అక్షతలు, సువర్ణదక్షిణ అందఱు దేవతలకు యిచ్చుచుండవలెను. 'అర్యమణం, అను మంత్రముచేత అర్యమునకు గంధము, చక్కెర, పిండివంటలు, పాలు, బలినిపెట్టవలెను. 'సవితా ప్రసవిత్రా, అను మంత్రముచేత సవితకు పాలు, బెల్లము, పిండివంటలు, బలినిపెట్టవలెను. 'వివస్వాన్, అను మంత్రముచేత వివస్వంతునకు రక్తచందనము, కర్పూరము, అగరు, పాలు, అన్నమును బలిని పెట్టవలెను. 'ఇంద్రః సుత్రామా, అను మంత్రముచేత ఇంద్రునకు నేయి, హరితాళము, అన్నమును బలినిపెట్టవలెను. 'తన్మిత్రం, అను మంత్రముచేత మిత్రునకు బెల్లము, పాలు, నేయి, అన్నమును

బలిని పెట్టవలెను. 'అభిగోత్రాణి' అను మంత్రముచేత రాజయక్ష్మునకు బెల్లము, పాలు, నువ్వులు బలిని పెట్టవలయును. 'పృథివీఛందః' అను మంత్రముచేత పృథివీధరునకు మినుపకుడుములు, మాంసము, గంధము, పాలు, బలిని పెట్టవలయును. 'భవామ' అను మంత్రముచేత ఆపవత్సునకు నేయి కూశ్మాండము పెరుగు బెల్లము కలిసిన యన్నమును బలిని పెట్టవలెను. 'ఆపోఅస్మా' అను మంత్రముచేత జలమునకు పాలు అన్నమును బలిని పెట్టవలయును. 'ఉపయామ' అను మంత్రముచేత సావిత్రకు కుశాన్నమును చలిమిడి మిరియము బలిని పెట్టవలయును. 'మర్మాణితే' అను మంత్రముచేత జయునకు గంధము నేయి, అన్నమును బలిని పెట్టవలెను. 'సుత్రామాణం' అను మంత్రముచేత రుద్రునకు పాలు బెల్లము, అన్నమును బలిని పెట్టవలయును. 'తమీశాన' మను మంత్రముచేత శిఖికి ఘృతాన్నమును బలిని పెట్టవలెను. 'మహాఇంద్ర' అను మంత్రముచేత పర్జన్యునకు కలువపూలతో అన్నమును బలిని పెట్టవలయును.

'ధన్వనాగా' అను మంత్రముచేత జయంతునకు నేతియన్నమును బలిని పెట్టవలయును. 'మహాఇంద్ర' అను మంత్రముతో ఇంద్రునకు పంచరత్నములతో అన్నమును బలిని పెట్టవలయును. 'సూర్యరశ్మి' అను మంత్రముచేత సూర్యునకు ధూమ్రమవర్ణముగల పిండివంటలు, వరిపేలపిండి, దర్భలతో అన్నమును బలిని పెట్టవలయును. 'వ్రతేనదీక్షా' అను మంత్రముచేత సత్యునకు నేయి గోధుమ అన్నమును బలిని పెట్టవలయును. 'భద్రంకర్ణే' అను మంత్రముచేత భృశునకు నేతియన్నమును బలిని పెట్టవలెను. 'వయంసోమశ్చ' అను మంత్రముచేత అంతరిక్షమునకు చక్కిలములు నేయిని బలిని పెట్టవలయును. 'అగ్నిందూత' మను మంత్రముచేత అగ్నికి గంధము, దర్భలు, నేయిఅన్నమును బలిని పెట్టవలెను. 'పూషంతవ' అను

మంత్రముచేత పూషునకు జొన్నపేలాలను బలినిపెట్టవలయును. 'సవితాప్రథమేహ,' అను మంత్రముచేత వితథునకు సెనగపప్పును, అన్నము బలినిపెట్టవలయును. 'సవితాత్వా,' అను మంత్రముచేత గృహాక్షతునకు తేనె అన్నమును బలినిపెట్టవలయును. 'యమాయత్వా,' అను మంత్రముచేత యమునకు నేతియన్నమును బలిని పెట్టవలయును. 'గంధర్వాస్త్వాద్,' అను మంత్రముచేత గంధర్వునకు పరిమళద్రవ్యముతో గూడిన యన్నమును బలినిపెట్టవలయును. 'మృత్యుస్సుపర్ణ,' అను మంత్రముచేత భృంగరాజునకు మినుపకుడుమును బలినిపెట్టవలయును. 'తద్విష్ణు,' అను మంత్రముచేత మృశునకు అలసందెపప్పు అన్నమును బలినిపెట్టవలయును. 'పితృభ్య,' అను మంత్రముచేత పితృదేవతలకు పులగమును మినుపగారెను తేనె, నేయిని బలినిపెట్టవలెను.

'ద్రవిణోయః,' అను మంత్రముచేత దౌవారికునకు పులగమును పిండివంటలును బలినిపెట్టవలయును. 'సుషుమ్న,' అను మంత్రముచేత సుగ్రీవునకు పిండివంటలును అలసందెపప్పు అన్నమును బలినిపెట్టవలయును. 'నక్షత్రేభ్యః,' అను మంత్రముచేత పుష్పదంతునకు పాలు అన్నమును బలినిపెట్టవలయును. 'మిత్రస్య,' అను మంత్రముచేత వరుణునకు పాలు అన్నమును బలినిపెట్టవలయును. 'యేరూపాణి,' అను మంత్రముచేత అసురునకు యొజ్జని బియ్యపు అన్నమును బలిని పెట్టవలయును. 'మంత్రమూసవే,' అను మంత్రముచేత శోషునకు నేయి అన్నమును బలినిపెట్టవలయును. 'సూర్యరశ్మి,' అను మంత్రము చేత పాపయక్ష్మనకు గోధుమపిండియును రక్తచందనమును బలిని పెట్టవలయును. 'ఆవాయో,' అను మంత్రముచేత మరుత్తునకు పేల పిండిని బలినిపెట్టవలయును. 'నమో஽స్తు సర్వేభ్యః,' అను మంత్రము చేత నాగునకు పుష్పములు, నాగకేసరములు, పులగమును బలిని

పెట్టవలయును. 'ఇషేత్వా' అను మంత్రముచేత ముఖ్యునకు గోధుమ అన్నమును నేయిని కొబ్బరికాయ నీళ్లును బలినిపెట్టవలెను. 'విష్ణుహోం' అను మంత్రముచేత భల్లాటునకు పాలు, తేనె, మినుపగారె, పెసరపప్పు అన్నమును బలినిపెట్టవలెను. 'వయంసోమ' అను మంత్రముచేత సోమునకు పాలు నేయి అన్నమును బలినిపెట్టవలయును. 'ఉదుత్యం' అను మంత్రముచేత సర్పమునకు వరిపిండి నేయి, పాలు బలినిపెట్టవలయును. 'ఉతనోహిర్బుధ్న్య' అను మంత్రముచేత అదితికి పులగమును బొబ్బట్లు బలినిపెట్టవలయును. 'అదితిర్ద్యౌ' అను మంత్రముచేత దితికి బూరెలు అన్నము బొబ్బట్లు నేయి బలిని పెట్టవలయును. మండలము వెలుపల చరకికి మాంసము నేయి బలినిపెట్టవలయును.

విదారికి మాంసము యెఱ్ఱని పుష్పములను బలినిపెట్టవలయును. పూతనకు మినుపగారెలును మంచినూనె, పెరుగు బలినిపెట్టవలెను. పాపరాక్షసికి బొబ్బట్లు నేయి చేపమాంసము కల్లు బలినిపెట్టవలయును. స్కందునకు మినుపగారెలును, మాంసమును అన్నమును బలినిపెట్టవలయును. అర్యమునకు మాంసమును బొబ్బట్లును పులగమును బలినిపెట్టవలయును. జృంభకునకు మాంసమును ఎఱ్ఱని బియ్యపు అన్నమును చేపలవాసనగల ధూపముతో బలినిపెట్టవలయును. పిలిపిచ్ఛునకు మేకచెవితో గూడిన మాంసమును బలిని పెట్టవలయును. క్షేత్రపాలునకు మినుపగారెలును పులగమును పిండియందు వెలిగించిన దీపముతో బలినిపెట్టవలయును. లోకపాలునకు నువ్వులనూనెతో వండిన మినుపగారెలును ఎఱ్ఱని పూలును బలిని పెట్టవలయును. ఉగ్రసేనునకు మాంసమును అన్నమును చేపయును నేయియును బలినిపెట్టవలయును. డామరునకు పెరుగుఅన్నమును

ఎఱ్ఱని పుష్పములును బలినిపెట్టవలయును. మహాకాలునకు నువ్వులు బలినిపెట్టవలయును. బీభత్సునకు మేకచెవి మాంసమును బలిని పెట్టవలయును. గణపతికి బెల్లము నేయి బలినిపెట్టవలయును. దుర్గకు మేక మాంసమును, కల్లును బలిని పెట్టవలయును. వాయువునకు మాంసమును బలినిపెట్టవలయును. ఆకాశమునకు పాలు పంచదార బలినిపెట్టవలయును. అశ్వినీ దేవతలకు పాలు చక్కెర నేయి అన్నమును బలినిపెట్టవలయును.

రుద్రునకు పాలు అన్నమును బలినిపెట్టవలయును భూమికి పాలు అన్నమును బలినిపెట్టవలయును. వాస్తు పురుషునకు సమస్తమైన పిండివంటలును చక్కెర పాలు నేయితో కూడిన అన్నమును బలినిపెట్టవలయును. ఇంద్రాది దిక్పాలకులకు పెరుగు అన్నమును బలినిపెట్టవలయును. తరువాత నవగ్రహములకు బలినిపెట్టవలయును. తరువాత క్షేత్రపాలునకు చతుర్ముఖదీపయుతముగ మినుపగారెలును పెరుగు అన్నమును బలిపెట్టవలయును. మరియు బియ్యమునుగూడ బలినిపెట్టి ప్రార్థించవలెను. తరువాత అందఱు దేవతలకు దక్షిణ తాంబూలాదులను సమర్పించి కర్పూరముతో ఆరతినీయవలెను. నారికేళజలముతో అర్ఘ్యమీయవలయును. అంతట బ్రహ్మకు పూర్ణ పాత్రదానము చేయవలయును. తరువాత బ్రహ్మగ్రంథిని విప్పి భార్యాభర్తల శిరస్సున మంత్రోదకమును ప్రోక్షించవలయును.

తరువాత యీశాన్యముననున్న స్థాలీపాత్రనువంచి పూర్ణాహుతి సంకల్పము చెప్పిన తరువాత యజమానుడు పత్నీయుక్తముగ నుండి శిల్పాచార్యునియొక్క కుడిభుజమును తాకుచు తాంబూలము అక్షతలు నేయి ఇవి స్రువమునందుంచుకొని పూర్ణాహుతి చేయవలెను. అనంతరము రుద్రకలశమునుదీసి బర్హిర్హోమము (దర్భలు

హోమములో వేయుట) చేయవలెను. భస్మమునకు నమస్కారము చేసి నేతితో కలిపి నొసలు, కంఠము, కుడిభుజము, రొమ్ము ఈ ప్రదేశములందు ధరించవలెను. తన పత్నియును నొసట ధరించవలెను. పుష్పాంజలితో గణపత్యాది సమస్తదేవతలకు నమస్కరించి తరువాత మేడిఆకులు, పాలతో గరిక, ఆవుపేడ, పెరుగు, తేనె, నేయి, దర్భ, గోధుమలు ఇవి సమభాగములు కంచుపాత్రలో నుంచి కూర్చున్న రెండుప్రక్కలను చల్లవలెను. అదే మంత్రముతో నాలుగు దిశలయందు చల్లవలెను.

ఆఱవ దినమున కల్యాణోత్సవమును చేయవలయును. ఏడవ దినమున అవభృథస్నానమును వసంతముతో నూరేగింపును చేయవలయును.

ఆగమప్రతిష్ఠావిధి—

"కపిలాయాః లబ్ధంక్షీర మాప్యాయస్వేతి మంత్రతః ।
శ్వేతా యాదధిచగ్రాహ్యం దధిక్రావణ్ణేతి మంత్రతః ॥

ఆజ్యంగ్రాహ్యం దురక్తాయాః శుక్రమసీతి మంత్రతః ।
ఉక్తవర్ణగవాభావే యథాసంభవమాదోత్ ॥

"ఏమధ్యం పూజయేల్లింగం ప్రక్షాళ్య చ పునః పునః ।
"అర్కవారేతు బిల్వంస్యా త్తులక్ష్మీ సోమవారవే ।

ఆరవారే కపిత్థంస్యా న్మాతులుంగంబుధీతథా ॥
గురువారేతు దమనం భార్గవేజంబుపుష్పకమ్ ।
శనివారే విష్ణుక్రాంతం వారపత్ర మిహోచ్యతే ॥

## శివాగమం

“మక్షికామశకాః కేశాః తృణబీజాని వల్కలాః,
పాషాణమృత్తికాశ్చైవ క్రిమికీటాది జంతుకః ।
ఏతాన్ సర్వాన్ పరిత్యజ్య శుచిపాకానియానివై,
తానిగృహ్ణామి దేవేశ క్షమస్వ పరమేశ్వర ॥
గృహేగృహాముఖం కుర్యాద ప్రవాహేర వేగ్మ్ముఖం,
ప్రవాహేసమ్ముఖం కుర్యాత్ ప్రవాహస్యయధావిధి ।
స్నానంకృత్వా చార్ద్రివస్త్రం ఊర్ధ్వముత్తారయేద్విజః
అర్ద్రివస్త్ర మధిస్తాచ్చే త్పునఃస్నానేన శుధ్యతి ॥
శూద్రాన్నం సూతకస్యాన్నం నైవేద్యం శ్రాద్ధభోజనం,
సీమంతాన్నం సమూహాన్నం రాజాన్నం చైవవర్జయేత్ ॥
యేకేచప్రేతరూపేణ వర్తంతే పితరోమమ,
తేసర్వేతృప్తిమయాంతి కుశహస్తైస్తిలోదకైః ॥

“సర్వత్రోంకార ఉచ్చార్య శ్రాద్ధమంత్రేషు నోచ్చరేత్,
ఆర్షచ్ఛందాం సివైతద్వద్యఋక్ పూర్వక కర్మణి ।
నస్మరేతఋషీన్ ఛందా శ్రాద్ధేవైతానికే మఖే,
బ్రహ్మయజ్ఞేచ వైతద్వత్తధోంకారం నతూచ్చరేత్ ॥

సర్వతో భద్రమండలం—

ప్రాదీచ్యాం గతారేఖాః కుర్యాదేకోన వింశతిః
ఖండేందు స్త్రిపదః కోణః శృంఖలా పంచభిః పదైః
ఏకాదశపదావల్లీ భద్రంతు నవభిః పదైః
తద్బాహ్యే పునరేతి.

# సర్వతో భద్రము

5 గడులు శృంఖల - నలుపు
24 గడులు వాపి - తెలుపు
16 .. పద్మము - ఎరుపు
20 .. పరిధి - పసుపు
11 .. వల్లి - ఆకుపచ్చ
9 .. ఎరుపు
3 .. అర్ధచంద్రుడు - తెలుపు



| | | | | | |
|---|---|---|---|---|---|
| శం చ | ప గ | చ శం | గ ప | ప శం | శం ప |
| గ ప | శం చ | గ ప | చ శం | గ చ | చ గ |
| కేశవ | నారాయణ | మాధవ | గోవింద | విష్ణు | మధుసూదన |
| గ చ | చ గ | చ గ | చ ప | ప చ | శం గ |
| ప శం | శం ప | ప శం | గ శం | శం గ | ప చ |
| త్రివిక్రమ | వామన | శ్రీధర | హృషీకేశ | పద్మనాభ | దామోదర |
| శం ప | శం చ | శం గ | గ శం | ప శం | గ శం |
| గ చ | ప గ | చ ప | చ ప | చ గ | ప చ |
| సంకర్షణ | వాసుదేవ | ప్రద్యుమ్న | అనిరుద్ధ | పురుషోత్తమ | అధోక్షజ |
| ప గ | ప చ | చ శం | గ చ | చ ప | గ ప |
| చ శం | గ శం | ప గ | శం ప | శం గ | శం చ |
| నారసింహ | అచ్యుత | జనార్దన | ఉపేంద్ర | హరి | కృష్ణ |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | 15 | 12 | 13 | 6 | 14 |
| కేశవ | ప్రద్యుమ్న | దామోదర | సంకర్షణ | మధుసూ | వామదేవ |
| 3 | 5 | 16 | 17 | 18 | 21 |
| మాధవ | విష్ణు | అనిరుద్ధ | పురుషోత్తమ | అధోక్షజ | జనార్దన |
| 4 | 7 | 9 | 10 | 19 | 20 |
| గోవింద | త్రివిక్రమ | శ్రీధర | హృషీకేశ | నృసింహ | అచ్యుత |
| 2 | 8 | 11 | 22 | 23 | 24 |
| నారాయణ | వామన | పద్మనాభ | ఉపేంద్ర | హరి | కృష్ణ |

ఓం

విశ్వకర్మాదిశాంపతిస్సనః పశూన్ పాతుసోఽస్మాన్ పాతు
తస్మై నమః

# అథ ప్రతిష్ఠాప్రయోగః

తత్రాదౌస్వస్తివాచనమ్ ॥ హరిః ఓం స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః । స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః । స్వస్తినో బృహస్పతిర్దధాతు ॥ 1) ఓం పయః పృథివ్యాం పయ ఓషధీషుపయో దివ్యంతరిక్షే పయోధాః ॥ పయస్వతీః ప్రదిశః సంతుమహ్యం॥ 2) ఓం విష్ణోర రాటమసి విష్ణోః శ్నప్త్రేస్థో విష్ణోఃస్యూరసి విష్ణోర్ధ్రువోసి । వైష్ణవమసి విష్ణవేత్వా 3) ఓం అగ్నిర్దేవతావాతోదేవతా సూర్యో దేవతా చంద్రమాదేవతా వసవో దేవతా రుద్రోదేవతాఽదిత్యాదేవతా మరుతోదేవతా విశ్వేదేవాదేవతాబృహస్పతిర్దేవతేంద్రోదేవతా వరుణోదేవతా ॥ 4) ఓం ద్యౌః శాంతిరంతరిక్షగ్ం శాంతిః పృథివీశాంతిరాపః శాంతి రోషధయః శాంతిః ॥ వనస్పతయః శాంతి ర్విశ్వేదేవాపి శాంతి ర్బ్రహ్మశాంతిః సర్వగ్ంశాంతిః శాంతిరేవశాంతిః సామాశాంతి రేధి ॥ 5) ఇతి స్వస్తిమంత్రాః । తత్రాదౌభూమిం పరిక్షీత చతు ర్దండా అవిచ్ఛిన్నాసమనతా ఇయం భూరితిగృహ్ణీయాత్ ॥ తస్యాం గాం సవత్సాం సప్తధాన్య మవ్రణం సవస్త్రం హేమగర్భం ఫల పుష్పజలాన్వితం కలశంనిధాయ తత్సరితికాలజ్ఞానం కృత్వా అముక

హం శరణం గతః తతః పాయసాపూపసక్త్వాదిద్రవ్యం పాత్రే కృత్వా సపరివారాయై భూమ్యై ఇమం బలిం సమర్పయామి ॥

ఇతి బలిం దద్యాత్ । తతః సూత్రధారం విశ్వకర్మాణం పూజయేత్ ॥ నమామి విశ్వకర్మాణం సర్వసూత్రప్రవర్తకం మండపాది ప్రసిద్ధ్యర్థం సర్వసిద్ధి సమృద్ధిదం ॥ అంగులనిర్మాణం పూజయేత్ । అంగులాదిప్రమాణార్థం నిర్మితో విశ్వకర్మణా అతస్త్వాం పూజయామ్యాహం మండపేష్టం ప్రసాధయ॥ తతః ఖననాంగమాధారశక్త్యాదీనాం పూజనమ్ ॥ ఓం ఆధారశక్త్యైనమః ఓం కూర్మాయనమః ఓం అనంతాయనమః ఓం పృథివ్యైనమః ఓం వాస్తుపురుషాయనమః తతః ఇష్టకాపూజనమ్ ఇష్టకాభ్యః పాద్యం సమర్పయామి అర్ఘ్యం సమర్పయామి ఆచమనం సమర్పయామి- స్నానవస్త్రగంధపుష్పధూపదీపనైవేద్యాదభిః సంపూజ్య తతః ప్రార్థనా॥ నందినీదేవి వాసిష్ఠేవసుభిః పూజితాసతీ భద్రేకాశ్యపదాయాదే కురుభద్రాం మతిం మమ జయే భార్గవదాయాదే ప్రజానాం జయమానహా పూర్ణేఽంగీరసదాయాదే పూర్ణాన్కామాన్ కురుష్వమే ప్రజాపతి సుతేదేవి చతురస్రేమహీసుతే సుభగేసువ్రతేదేవి గృహేభార్గవి రమ్యతాం అవ్యంగేచాక్షయబలే పూర్ణేచాంగిరసః సుతే । ఇష్టదేవ ప్రతిష్ఠాసు త్వాం ప్రతిష్ఠాపయామ్యహం దేశగ్రామ పురక్షేత్ర గృహాన్వా మిషుసౌఖ్యదా మనుష్యపశుహాస్త్యశ్వ ధనవృద్ధికరీభవ॥ ఇతి సంప్రార్థ్య తతో వేదికోణేషు ఇష్టకాప్రక్షేపః తతో యజ్జాగ్రతః ఇతి షద్రుచో జపేత్ ॥

ఓం యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదుసుప్తస్య తథైవైతి । దూరంగమం జ్యోతిషాం జ్యోతిరేకం తన్మేమనః శివసంకల్పమస్తు ॥ 1) యేనకర్మాణ్యపసోమనీషిణో యజ్ఞేకృణ్వన్తి విదథేషు

ధీరాః। యదపూర్వం యక్షమంతగ్ః ప్రజానాంతన్మేమనః శివ సంకల్పమస్తు॥ 2) యత్ప్రజ్ఞానముత చేతోధృతిశ్చయజ్జ్యోతి రంతరమృతం ప్రజాసు॥ యస్మాన్నఋతే కించన కర్మక్రియతే తన్మేమనః శివసంకల్పమస్తు॥ 3) యేనేదంభూతం భువనం భవి ష్యత్పరిగృహీతమమృతేన సర్వం॥ యేనయజ్ఞస్త్రాయతే సప్తహోతా తన్మేమనః శివసంకల్పమస్తు॥ 4) యస్మిన్నృచః సామయజూగ్ంషియస్మిన్ ప్రతిష్ఠితా రథనాభావవారాః। యస్మింశ్చిత్తగ్ంసర్వ మోతం ప్రజానాం తన్మేమనః శివసంకల్పమస్తు॥ 5) సుషారథి రశ్వానివ యన్మనుష్యాన్నేనీయతే భీశుభిర్వాజిన ఇవ॥ హృత్ప్ర తిష్ఠంయదజిరం యవిష్ఠం తన్మేమనః శివసంకల్పమస్తు॥ 6) తతః శిల్పాచార్యః యాజ్ఞికః కుశాస్తరణేశయీత॥ తతోనిశాశేషేజాత స్వప్నేన శుభాశుభఫలం జ్ఞాత్వా ప్రాణాదీన్ సంశోధ్య వ్యవహ రేత్। తతోమండపరచనా। సూత్రేణకృత నవభాగమండపమధ్య గతనవమభాగే మండలంకృత్వా।

తదుత్తరేకుండం స్థండిలం వాకుండాద్యామ్యేవా మధ్యేవేతి। తతోమధ్యవేద్యాం దక్షిణదిగ్భాగే వాస్తుమండలం కార్యం. ఐశానే గణపతిపీఠం పంచవింశత్యుత్తర శతబ్రహ్మర్షిసహితంతథా పంచవింశ త్యుత్తరశత దేవీసహితం గాయత్రీవిశ్వకర్మ పూజామండలం। తత్ర వరుణకుంభ స్తత్సమీపేగ్రహపీఠం। అగ్నికోణే అష్టవసువసోర్ధా రాజలమాతృషోడశ మాతౄణాం స్థాపనం। నైరృత్యకోణే యోగినీ స్థాపనం వాయవ్యకోణే భైరవగణమరుద్గణ స్థాపనం। వంశకాష్ఠ

కదలీ స్తంభాదిరచిత వితానాదియుతే మండపే పూర్వాది క్రమేణ ప్లక్ష ఉదుంబర న్యగ్రోధ అశ్వత్థతోరణానాం స్థాపనం। పీతరక్త శ్యామ కృష్ణ శ్వేతధూమ్రపీతరక్తమేఘ వర్ణరక్తవర్ణధ్వజానాం స్థాపనం। మధ్యేపంచవర్ణ మహాధ్వజాః స్థాప్యాః। మండపపూజాంత్వగ్రే వక్ష్యామః। పరిచ్ఛిన్నాం భూమిం సమచతురస్రాం కృత్వా యజమానఃసర్వౌషధిభిర్వారుణమంత్రైః సుస్నాతః స్వలంకృతః సస్త్రీకః శుచిర్భూత్వా మాతృకాపీఠసమీపే ప్రాఙ్ముఖః పత్న్యాసమన్వారబ్ధః। సచేత్థం పత్న్యాః అంచలకోణే రక్తాక్షతహారిద్రాదూర్వాఫలాని బధ్వాయజమానస్య ప్రతిష్ఠావిధౌ వామపార్శ్వేపత్నీ ముపవేశయేత్ ॥ "సర్వేషు ధర్మకార్యేషు, పత్నీదక్షిణతస్సథా ॥ ఇతి వచనాత్। అథప్రాణానాయమ్య గణపతి స్మరణపూర్వకం। దేశకాలే స్మరేత్ తద్యథా ॥

ఓం శ్రీమన్మహాగణాధిపతయేనమః। ఓం గాయత్రీ విశ్వకర్మభ్యాంనమః ఓం ఉమామహేశ్వరాభ్యాం నమః। ఓం లక్ష్మీనారాయణాభ్యాం నమః। ఓం వాణీహిరణ్యగర్భాభ్యాం నమః। ఓం శచీపురందరాభ్యాం నమః। ఓం సంజ్ఞాభాస్కరాభ్యాం నమః। ఏతత్కర్మప్రధానదేవతాభ్యో నమః। ఓం ఇష్టదేవతాభ్యో నమః। ఓం కులదేవతాభ్యో నమః। ఓం గ్రామదేవతాభ్యో నమః। ఓం వాస్తుదేవతాభ్యో నమః। ఓం మాతాపితృచరణ కమలాభ్యాం నమః। ఓం సర్వేభ్యోదేవేభ్యో నమః। ఓం సర్వేభ్యో బ్రాహ్మణేభ్యోనమః। నిర్విఘ్నమస్తు। ఓం సుముఖశ్చైకదంతశ్చ। కపిలోగజకర్ణకః। లంబోదరశ్చ వికటో విఘ్ననాశో వినాయకః ॥ "ధూమ్రకేతుర్గణాధ్యక్షో। భాలచంద్రో గజాననః ద్వాదశైతానినామాని యః పఠేచ్ఛృణుయాదపి. విద్యారంభే వివాహేచ ప్రవేశేనిర్గమేతథా। సంగ్రామే సంకటేచైవ। విఘ్నస్తస్య నజాయతే ॥

"శుక్లాంబరధరం దేవం, శశివర్ణం చతుర్భుజం, ప్రసన్నవదనం ధ్యాయేత్, సర్వవిఘ్నోపశాంతయే॥ లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాజయః యేషామిందీవరశ్యామో హృదయస్థో జనార్దనః॥ అభీప్సితార్థసిద్ధ్యర్థం। పూజితో యస్సురాసురైః సర్వవిఘ్నచ్ఛిదే తస్మైగణాధిపతయే నమః ఏవం ధ్యాత్వా। ప్రధానసంకల్పము ఓం అద్యశ్రీబ్రహ్మణోఽహ్ని శుభపుణ్యతిథౌ యజమానస్య సకుటుంబస్య సపరివారస్య సర్వారిష్టప్రశాంత్యాయురారోగ్యైశ్వర్య సుఖశ్రీ ప్రాప్త్యర్థం. పుత్రపౌత్ర ధనధాన్యాది సంపత్ప్రవృద్ధయే అఖిలషిత మనోరథానాం సిద్ధ్యర్థం.

ఇహజన్మని జన్మాంతరే సర్వపాపక్షయార్థం ఏతదాలయ ప్రతిష్ఠాపనకాలే సర్వశాంత్యర్థం దేశస్వాస్త్యర్థం వేదవేదాంగ వ్యాకరణ ఛందభట్ట ప్రభాకరాది వృద్ధ్యర్థం గంగా యమునాది సర్వ నదీనాం తీర్థాభివృద్ధ్యర్థం కాలానుగుణ్యప్రకార పర్జన్యప్రవర్షాధిక జలాభివృద్ధ్యర్థం త్రయస్త్రింశత్కోటి దేవతాభినందార్థం సాలోక్య సారూప్యసామీప్య సాయుజ్యాభిసిద్ధ్యర్థం సకలమునీనాం ధ్యానధారణాద్యష్టాంగయోగాది సిద్ధ్యర్థం ప్రతిరాత్రవాజపేయ పౌండరీకాది శతక్రతూనాం సంపూర్ణ ఫలసిద్ధ్యర్థం దేశాభివృద్ధ్యర్థం రాష్ట్రాభివృద్ధ్యర్థం అస్మిన్ దేశే లక్ష్మీనివాససిద్ధ్యర్థం రాష్ట్రశాంత్యర్థం రాష్ట్రాణామఖిల సంపత్పరం పరాభివృద్ధ్యర్థం అస్మిన్ దేశేజారచోరాగ్నిభయోలోకోత్పాతమారీజ్వరాది సర్వపీడాపరిహరణార్థం ఏతద్గ్రామోస్థితానాం సర్వేజనానాం ధనధాన్యవస్తువాహన గోమహిష పుత్రపౌత్రసేవక బంధుమిత్రాద్యష్టైశ్వర్యాభివృద్ధ్యర్థం ఏతదాలయాచార్యార్త్విక పరిచారకాభివృద్ధ్యర్థం వాస్తుపూజా వాస్తుహోమ పర్యగ్నికరణాభివృద్ధ్యర్థం అంకురారోపణ జలాధివాసధాన్యాధివాసన్ త్రోస్మిలనద్రుక్ స్థాపనాది బింబసిద్ధ్యర్థం కుంభపూజ కళా

వాహనాది సిద్ధ్యర్థం మహాశిల్పిభిస్సహ పుణ్యాహవాచనం కరిష్యే ప్రతిష్ఠాంగత్వేన గణపతిపూజన వరుణపూజన రక్షత్రిగ్వరణ పుణ్యాహవాచన గ్రహవసోర్ధారా మాతృకాస్థాపన ప్రతిష్ఠాపూజన పూర్వకవృద్ధిశ్రాద్ధ మహంకరిష్యే॥ మండపభూమౌ సర్షపవికిరణం। తత్రమంత్రాః "యదత్ర సంస్థితం భూతం స్థానమాశ్రిత్య సర్వదా స్థానంత్యక్త్వాతు తత్సర్వం యత్రస్థం తత్రగచ్ఛతు॥ అపక్రామంతు భూతాని పిశాచాః సర్వతోదిశం సర్వేషామవిరోధేన వాస్తుపూజాం సమారభే॥ భూతప్రేతపిశాచాద్యా అపక్రామంతు రాక్షసాః స్థానాదస్మాద్వ్రజంత్వన్యే స్వీకరోమిభువంత్విమాం॥ పశ్చాద్వక్ష్యమాణరీత్యా కృతపంచగవ్యేన మండపప్రోక్షణం గాయత్ర్యా గోమూత్రం॥

"ఓం గోమదూషుణా సత్యాశ్వావద్యాతమశ్వినా॥ వర్తీ రుద్రానృపాయ్యం "ఇతిగోమయం॥ ఓం ఆప్యాయస్వ సమేతుతే విశ్వతః సోమవృష్ణ్యం భవా వాజస్యసంగథే॥ ఇతి క్షీరం "ఓం దధిక్రాష్ణో అకారిషం జిష్ణోరశ్వస్య వాజినః॥ సురభినోముఖాకరత్ప్రణ ఆయూగ్ం షితారిషత్॥ ఇతిదధి "ఓం ఘృతం మిమిక్షే ఘృతమస్యయోనిర్ఘృతే శ్రితోఘృతం వస్యధామ। అనుష్వధమావహ మాదయస్వ స్వాహాకృతం వృషభవక్షిహవ్యం॥ ఇతిఘృతం "ఓం ఆపోహిష్ఠామయోభువస్తాన ఊర్జే దధాతన మహేరణాయచక్షసే। యోవః శివతమోరసస్తస్యభాజయతేహనః ఉశతీరివమాతరః తస్మా అరంగమామవో యస్యక్షయాయజిన్వథ ఆపోజనయథాచనః॥

ఇతి కుశోదకం గృహీత్వా గాయత్ర్యా సర్వాణ్యేకీకృత్య ప్రణవే నాలోడ్య పంచగవ్యేన పరికల్పితాం మండపభూమిం ప్రోక్షయేద్వా వృద్ధిశ్రాద్ధాంతే ప్రోక్షయేత్ ॥ "ఓం గణానాం త్వాగణపతిగ్ం హవామహే ప్రియాణాంత్వా ప్రియపతిగ్ం హవామహే నిధీనాం త్వానిధిపతిగ్ం హవామహే వ్వసోమమ ॥ ఆహమజాని గర్భధ మాత్వమజాసి గర్భధం ॥ 1) ఓం విశ్వాని దేవసవితర్దురితాని పరా సువ యద్భద్రం తన్న ఆసువ ॥ 2) ఓం స్వస్తిన ఇంద్రోవృద్ధశ్ర వాః స్వస్తినః పూషా విశ్వవేదాః ॥ స్వస్తినస్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతిర్దధాతు ॥ 3) ఓం ద్యౌః శాంతి రంతరిక్షగ్ం శాంతిః పృథివీ శాంతిరాపః శాంతి రోషధయః శాంతి ర్వనస్పత యః శాంతిర్వి శ్వేదేవాః శాంతి ర్బ్రహ్మ శాంతిః సర్వగ్ం శాంతిః శాంతి రేవశాంతిః సామాశాంతి రేధి ॥ 4) అథాతః సంప్ర వక్ష్యామి గణయాగం సుశోభనం కామికే వాసికే యజ్ఞే వివాహే వ్రతసంయమే ॥

ఆదౌగణేశ్వరః పూజ్యః సర్వకామఫలప్రదః ॥ మాసమాసాధిపః పూజ్యో గణేశో యోభవిష్యతి ॥ తేన ప్రపూజ్యతే యజ్ఞే మాసాచార్యోగణేశ్వరః యోఽసౌమాసపతిర్దేవః సర్వవిఘ్న వినాశనః ॥ శ్రీకృష్ణఉవాచ ఆదౌగణేశ్వరః శ్రేష్ఠో విఘ్ననాశో వినాయకః సర్వకామకృతో పూజ్యో యజ్ఞకాలే సనాతనః ॥ మండలంచ తతః కుర్యాత్ కోష్ఠానాం ద్వాదశః స్మృతం సిందూరస్థాపితం దేవమీశానేచ వినాయకం క్రమయుక్తస్తతః స్థాప్యో మాసమాసాధిపః

ప్రభుః మార్గేగణపతిః పూజ్యః పౌషే చైవ వినాయకః గజవక్త్రో మాఘమాసే ఫాలచంద్రోఽథ ఫాల్గునే ఉపేంద్ర శ్చైత్రమాసేచ వైశాఖే విఘ్ననాశనః జ్యేష్ఠే శివసుతఃపూజ్యః ఆషాఢే హరనందనః శ్రావణే విఘ్నరాజస్తు భాద్రేఽసౌ మోదకప్రియః ఆశ్వినేకార్తికే మాసి మహావీర స్తథైవచ విఘ్నహర్తాధికేమాసి ఏవం పూజ్యో గణేశ్వరః ॥ గంధపుష్పై స్తథాధూపైః కర్పూరై ర్యక్షకర్దమైః మృగాణాం కుంకుమైః శుభైః సిందూరేణవిశేషతః రక్తోత్పలదళైః పూజ్యో బిల్వపత్రేణకేసరైః మాలతీకేతకీపుష్పై ర్హేమపుష్పైర్విచ క్షణః అర్ఘ్యపాద్యైశ్చ ధూపైశ్చ రక్తవస్త్రేణ ఛాదయేత్ పూజాం కుర్యాత్తు దేవస్య దద్యాన్మోదక భోజనం నమోమూషకమారూఢ శుభకర్త్రేఽథ తేనమః ॥

నమఃకాత్యాయనీపుత్ర లంబకర్ణాయవైనమః ఉద్యద్రవిస్వ రూపాయ విద్యాబుద్ధి విచక్షణ దేహిమే పుత్రసౌభాగ్యం దేహిమే సుఖసంపదం వాంఛాసిద్ధిం చమేదేహి విద్యాం దేహి యశోధనం శత్రవోనాశమాయాంతు దుర్జనోనాశమాప్నుయాత్ స్వానాంచైవ హితార్థాయ ప్రార్థయిత్వాగణేశ్వరం ఆదౌపూజ్య గణేశంతు శాంతిపాఠమథాచరేత్ నాశయేత్సర్వవిఘ్నాని కల్యాణం జాయతే సదా కృష్ణేన భాషితం పూర్వం దేవతానాం హితార్థినా ఉత్పాతే విఘ్నసంభూతే పూజయేద్గణనాయకం ॥

ఓం ఆవోదేవా ఇతి మంత్రేణా వాహయేత్ ॥ ఓం మనోజూతి ర్జుషతామాజ్యస్య బృహస్పతి ర్యజ్ఞమిమంతనోత్వరిష్టం యజ్ఞగం సమిమం దధాతు ॥ విశ్వేదేవాస ఇహమాదయంతామోం ప్రతిష్ఠ ॥ ఏషవై ప్రతిష్ఠానామయజ్ఞో యత్రైతేన యజ్ఞేన యజంతే సర్వదేవ ప్రతిష్ఠితం భవతి ॥ ఇత్యావాహనం ॥ ఓం నమోగణేభ్యో గణపతి

